## మృతుఁడైన సిరియాలుసుతుఁడు బ్రతుకుట.

"పున్నామనరకము నుండి తల్లిదండ్రులమగు మమ్ముద్ధరించెడు నాచిన్ని కన్నకొడుకా! నాపండ్రెండేండ్లబాలకుమారా! నవమన్మథాకారా! సకలసుగుణాగారా! సంసారపంకనిమగ్నపితరసముద్ధరణా! సముద్ధనిర్భరానందకార్భకా, నిర్భరమశ్శోకశమునా, నాకన్నతండ్రీ! నాసిరాలా, నాముద్దుపట్టీ! మాయయ్యా! సుడిభుజమును నాయెడమకన్ను నదురుచున్నవి మమ్మున్మరచిపెట్టక సీగజైరెండెల ఘుల్లుఘుల్లుచప్పుడుతో చప్పున పరుగెత్తుకొనివచ్చి నీముద్దుమోముజూడ నీడగాచియున్న నన్ను వెనుక పాటువచ్చి కౌఁగలించుకొనుమని నలువిక్కులనాలుగుమూలలఁ బిలుచుపరిక్కునబ్బాలుఁడుపరుగెత్తుకొనివచ్చి తల్లింగాంచి దండంబు పెట్టుచుయు, నాపేరాలుండుసుఁ దల్లియుఁదండ్రియుఁ గలుసుకొని నిజపరివారముతోఁ దిపసికడ సంభోవ సమకట్టియోఁగుసరికి నటనా పినాకియుదృశ్యుండై తత్క్షణము మాచు వారల వెంగంచి రుద్రాక్షజటామకుటంబుతో నాగశిఖావాశంబుతో నాకాశగంగాప్రవాహ సంకలితజటాజూటంబుతో వామార్ధదేహాలంకృతశ్యామాదేవితో గజచర్మపరిధానంబుతో బ్రహ్మవిష్ణు రుద్రగణ ప్రమథగణ వీరభద్రాది కుమారవర్గంబులతో శూలవజ్రఖడ్గపరశ్వాద్యాయుధాద్యాల కరిష్ణుండగుచు వృషభవాహనారూఢుండై నిరూఢభక్తపరిపాలనదక్షుడగు కటాక్షనిరీక్షణంబుదోఁ బ్రత్యక్షుండై తనయెదుట నుదుట కేల్త్రంబడిన ముకుళితహస్తంబులతో నిలువంబడియున్న సిరియాలును దత్స్త్రీపుత్రులంగాంచి యభినందించి తత్పరిజనంబులనె గాక సమస్తపురజనంబులను కైలాసంబునకు నకళేబరంబులతో గొంపోయి యట నిజప్రమథగణంబులతో గలుపుకొని సుఖస్థితినుంచెను. ఇట్లు భద్రరథుండగు నారుద్రుండు కాంచిపురంబునంగల సకలజీవులం గైలాసవాసులం జేయ సిరియాలుశెట్టి ప్రమథగణంబులతోఁ గలసిమెలసి సంచరించుచు నొకదినంబున నందరుపిన "నిజపు

త్రుంజూపి యీశ్వరునికి విందొనర్చి మెప్పించి మరల పుత్రునింబడియు
టయేగాక పరిజనసమేతంబుగా గైలాసంబుం జొఱఁగొన్న నావంటిభ
క్తుఁడు ముల్లోకంబులం గలఁడే" యని గర్వంబునం బలికె ఇట్లు చిరు
తొండనంబికిఁ (సిరియాళు) గలిఁగినగర్వం బపనయింపందలంచి యీశు
విలుకానిం బరిమార్చిన యార్చిష్మన్నేత్రుండు తెలియనివానివలె నటించి
యొకనాఁడు దరహాసముఖంబున నాతనిం గని నవ్వుచు "శెట్టీ, మనము
శివుఁడు సిరియాళుశెట్టిం దోడ్కొని నిమ్మవ్వకడకు వచ్చుట
కమాఱు భూలోకంబునకుం బోయివత్తము రమ్మా"యని చెయివట్టి
యిద్దఱు జంగమరూపంబులు దాల్చి నిమ్మవ్వ సదనంబునకు రాఁగా నా
యవ్వయుం గడుముదంబున వారలఁ గాంచి సంతసించి మద్గృహపావనం
బు గావింపవరుదెంచిన భూరుద్రులను మీరు నాయింట భిక్షగైకొండని
వారల కాసనంబులు గల్పించి శయ్యలం బవళింపించి యిందుఁ గొంతతడవు
సుఖసుప్తి నరుగండు. నేవంటసేసి మీకు స్నానంబునకు జలము సిద్ధము సేసి
లేపెదనని ప్రార్థించి వారలఁ దనయింట విడియించి తాను వంటసేయు
చుండ వీరిద్దరును సుఖగోష్ఠిం బ్రొద్దుపుచ్చుచుండిరి. మఱికొంతసేపటికి
నిమ్మవ్వ షడ్రసోపేతంబులగు భోజనపదార్థంబులు సిద్ధపఱచి స్నానం
బునకు నీరు నాలవని ఘటంబుగొని నూతికి పానీయంబుం గొని రానేగెను.

ఇంతట నామెకొమరుండు పసువులఁ గాయుచుండి యాఁకలియగుటచే
నింటికివచ్చి వంటయిలు సొచ్చి "అమ్మా! యమ్మా" యని తల్లిని పదిసా
ర్లు పిలిచి పలుకకున్న నెందుఁబోయెనోయని యొకతబుకులో పక్వంబు
లై యున్న రెండుబూరెలం దీసికొని తినుచుండఁబోవుచున్నంతలో నీరుదీసి
కొని వచ్చినయవ్వ వానిం గని "యోరికుక్కా, భక్తులకొఱకు సిద్ధపఱి
చిన పాకద్రవ్యంబుల నంటిమ్మెలబుట్టితివా? ఇట్టి నీవంటి కొడుకుండి
నేమి లేకనేమి" యని వానిం జావమొత్తి గాడిలోఁ ద్రోసివేసి

## నిమ్మవ్వ తనసుతునిఁ జంపుట.

యాశవముపైఁ దొక్కకప్పి శుచిస్నాతయై మఱల పునఃప్రయత్నంబు
చేసి పరిశుద్ధపాకంబొనర్చి జలంబుంగొనివచ్చుటకై మఱల నేటికింబో
యెను ఈనడుమ శివుండు సిరియాలుం దోడ్కొని గాడియొద్దకుంబోయి
చచ్చినసుతునిఁ గప్పినతొక్కను గాలితోఁ దూలించి యాశవమును
జూఁపి కంటివా, యీమగువసాహసము మనకై సిద్ధపఱచిన పదార్థం
బుల వీఁడు స్పర్శించుటచే నవి యపవిత్రంబులైనవని గోతిపాలుగాఁ జేసి
మఱల వంటచేసి మనస్నానంబునకు జలంబు తేఁబోయినది.'' అని యవ్వ
చేసిన సాహసకృత్యపూర్వోత్తరం మతనికిఁ జెప్పి యప్పటియట్లు నిద్రిం
చువానివలె వారిద్దఱుఁ బండుకొనియుండిరి అవ్వ యేతెంచి వారలను
స్నానంబునకు లేపి ''వేగమ శివపూజ గావింపుఁడు, ఆలస్యమైనది. మిగుల
సొక్కలిగొనియుందురు గాఁబోలు ''నని స్నానోదకం బచటనుంచి గృహం
బున వారికి సివపూజాసామగ్రియంతయు సిద్ధము సేసి కాఁచియుండెను
వారును కృతస్నానులై ధౌతవస్త్రంబు లుధరించి విభూతిరుద్రాక్షలు ధరిం
చి లింగపూజలుగావించి యవ్వ యొడ్డించిన పదార్థంబు లారగించుటకు
మున్న మిన్నేటి వాకదాలుపు నిమ్మవ్వం జీరి'' అవ్వా! నీకొమరుండింత
కుమున్నిచటికేతెంచి నిన్నుఁ బదిపర్యాయములు పిలిచినను నీవు పలు
కకున్నకి నెటనోపోయెను. పాప మెంతయాకలిగొనివచ్చెనో, అట్టిబాలుని
విడిచి మేముభుజించుట శ్రేయముగాదుగనుక వానిం బిలిచి తోడ్కొని
రమ్ము. మేము ముగ్గురముఁగలిసి భుజించెదము. అంతదనుక మేముగా
చియుందుము శీఘ్రంబుగ బిలువుమమ్మా ''యని యానతిచ్చిన నాయిం
తియెంతయు దరహాసంబుతో'' నో కఱకంఠా! నన్నేల మాయసేసెద
వు. ఆఁడుదాననని యా నన్ను భ్రమింపవచ్చితివి ఈనీవేషంబులు మాను.
నేను సిరియాలు చిరుతొండ ననుకొంటివా? సుతుఁ జంపి నిన్ను మెప్పించి
మఱలఁ దత్సుతునితో నీవొసంగిన కైలాసము నేనొల్ల. నాసుతుండు స్వ

కృతాపరాధా ఘనదోషంబులవమ్మగ్గ. వానిపాదంబులవనవాఁడు. పూతుండ య్యె. అట్టి పాపిష్ఠికుమారుండు నా కేల. నేనువానిఁ బిల్వను. వాఁడు రాఁడు. పొద్దువోవుచున్నది. ప్రొద్దుఁడఁగానె యీసుభోజనంపుఁడు. నాసు తుఁవార్తయిఁక కేల? పాపాత్ముఁడు నావకఁ బ్రతుకునా? చచ్చినవాఁడుమర లవచ్చునా? వచ్చినను నేనుమెచ్చను. ఇఁకఁ దడయక సుఖభోజనముకా నిం[illegible]డని వారలఁ దొందరపెట్టనిమ్మవ్వ ధైర్యస్థైర్యంబులకు సిరియా

## నిమ్మవ్వకు శివుఁడు ప్రత్యక్షమగుట.

లంతస్సుఁ జెంది మొగంబు వాల్చుకొనియెను. మఱియునతండు నిర్భరనిర చింతార సనిర్మగ్నమాన మానసుండై నిశ్చేష్టుండై యిన్నకున్నతతి నప్పరమేశ్వరుండు ఉమాసమేతుండై నందివాహనంబెక్కి ఫాలలోచ నంబువిలసిల్ల నీలకంధరంబు బంధురద్యుతి నుతంబుగా హిమవచ్ఛి ఖరంబుజట్టుకొన్న వన్యాకాలకాలజీమూతంబుపగిది నిగనిగలాడుచుండ నజహరిప్రముఖ నిఖిలగీర్వాణులును దమతమదేవీసమేతులై తోడనగు దేర రుద్రప్రమథగణంబులతోఁ జతుర్భుజుండై నిజనాథోచ్చంభురూ పంబునఁ బ్రత్యక్షుండై యెదుటనిలిచినఁ గని తయ్యంగన యిట్లనియె.

నీలకంఠా! యేమి యీనీవేడబములు. భక్తులమొఱ భగవంతుఁ డుపడుపాట్లబెట్టితె తొల్తనొక కొంటెతనపు మాయవేషమున నేతెంచి భ్రమవెట్టి తుదకు నిజరూపుసూపి రారమ్మనిపిలుచుట, వరంబులు వేఁడుమనుట, యిదిమొదలగు పనులు నేనెఱుంగనిగానను గాను. మాని నినైనను సీమాతులకు లోనుగాను ఆకలిగొనిన స్తనంధయుఁడు తల్లి చనుఁబాలకపేక్షించి యేడ్చుచుండ నాతల్లిబొల్లిమాటలచే బెం[illegible]ండ యొకటిచేతఁబెట్టి లాలించి పాలువాలి యేగుగతి, నాయింటఁగొడుకువచ్చి నాచేత తాంబూలములఁ బింసివంటలతో బాకంబుసేయించి సిద్ధపఱచుకున్న భోజనముమాని, యిట్టిమాయారూపములం జూపిన నేఁజోనిచ్చువానను గాను. తొల్లింటిభక్తులభంగి నేనీభక్తులకు లొంగి నీవిచ్చువరంబులం

బడసి యాలోకంబునఁ జిరకాలంబు బ్రతికి తుదకుఁ గైలాసంబుఁ జేరఁ దానను గాను. మఱియు నిప్పు డీసీ వెంటి మన్నని చీరనఁ జేరు దానను గాను. ఇఁక లేనిపోని యనూనమానితాకారంబులం బూనక మానక తిన్నఁగఁ గూర్చుండి నీవడ్డించిన యన్నంబువంటకంబులలో నారగించి మఱిపొమ్ము. నమ్ము. వదలను కదలనియ్యను" అని గట్టిపట్టుపట్టియున్న యన్నమన్నకోరికదీర్పఁ గూర్చుండి దండిగ భుజించి సిరియాలుం డనుమని యాతని చిఱుతదీర్చి ముఖంబెత్తి "నీవేల యిట్లు చిన్నవోవుచున్నావు? పన్నగభూషణు భక్తులచరితంబులు వినలేదె తొల్లి కాటకోటచండికాదులోక నిమిత్తమునఁ దమతండ్రుల నాప్తులనెంతయుఁ గొంకక ఖండించి కండకండలుగాఁ జెండి యావెంటనె సాక్షాత్కరించిన నాలీలన మఱిల వారలు జీవంబులం బొందలేదె?

## నరసింగనైనారుకథ

మఱియు పారభక్తులలో నొండగు నరసింగనయ్య నారనువాఁడు భూరమణీకంఠహారతరళాయమానంబై మాననీయంబగు ద్రవిడదేశంబునకు రాజైయుండె. యొక్కనాఁడు రాణివాసంబుతో నుద్యానవనంబునకేఁగి యందున్న పన్నగాభరణు మందిరంబునకేఁగి యందు నిందుశేఖరుం బూజించుటకుఁ బూలుదెమ్మని తోటమాలికాజ్ఞాపింప వాఁడు వాడనినద్యోనికృత్తంబులగు పూలగుత్తులగంపతోనిడి దేవపూజకుఁ గొనిరా నారాజురాణియందొక పూవుంబీసి తనముక్కున మూరాసూఁడ నాపూలవాఁడు భూవిభుదేవి ముక్కుఁగ్రక్కునఁ గోసెను. అది గని తోటబోటులు ఘూకునఘూషించుచుఁ బరువులిడి రాజునకావార్త నివేదించిన భూపతి యాపువ్వులకాపరిఁ బిలిపించి "ఔరా, మూర్ఖా, నీకు శివపూజావిధానంపు పరిపాటి తెలియదు శివపూజకు నాయత్తము సేయఁబడిన పూలగుత్తులలో నొకపూవుంబీసిన చేతినిముందుండ నుమకన్ముక్కునా చక్కఁగఁ గోసితివి? ఛీ పోయని వానింబంపి యింపుమాట

లతో సొంవుక త్రెంబిలువనంపి 'యోసీ! నీవాపూవు నెట్టుచేయిజాపితీసి
తివి మాతము చాఁపుమాయనిచేయిచాపించి యాకరంబుం దనకరవా
లంబునఁ బ్రకోష్ఠంబునొద్దనుఁ దద్దయుకయంబునఁ దెగనఱుక నేముపవి
త్ర్యక్షుమై తెగినముక్కుఁడునకయు హస్తకమలంబును మఱలనయ్యె
వ్రోట్లనతికి యవింగితజ్ఞులాలగు సీయాలికి నట్టిబుద్ధిపుట్టించిన దోషంబు
నాదిగాని యామెదిగాదని యొసఁబఱచి యొప్పగించి గైనుమన నిండు
మనంబున మఱిమఱియుప్పొంగుచు. శేషొన్నవాఁడు గాఁడా? మఱియొ
కనాఁడు పుడమితేఁడు దనచేడియ కొట్లనున్న ధాన్యమంతయు వెచ్చఁ
బెట్టినదనికోపించి గర్భిణియను నవమానమైన లేక తలఁదఱిగిమఱల
నాకృపచే నామెప్రాణములం బడయలేదె? ఇట్టివిగా భక్తులచర్యలు.
ఇఁకమన యన్వయోత్పన్నసేసిన తనయుని చప్పండుగానివెఱవునఁ జంపి
వెట్టియు నేఁబ్రసన్నుఁడనైన వాముిచ్చెద వేఁడుమన్న మిన్నకుండి
మఱల యాలనాసినదిగాఁడె సూనుని ప్రాణంబులనిమ్ముగోరినాఁ? నిజ
మె ఏమి, స్త్రీయాను జప్పుమన నాతోఁ మున్ను విన్నపంబుసేసి
నాయనుజ్ఞపైఁ జంపితివిగాన నేఁ బిలువుమననీయుంగనపిలిచె. తెనయుఁ
డు సనుదెంచె. నిమ్మన్వయో. మనమెఱుంగకుండఁ గను మొఱఁగిచంపి
నదిగావున మనముపిలువమన్నను బిలువకయ్యె ఇట్టిభక్తులు, భక్త
రాండ్రు ననేకులుగలరు కాఁబట్టి నేనభక్తాగ్రేసరుఁడనని యహంక
రించి విఱ్ఱవీఁగరాదు" అనిపరమేశ్వరుఁడు సెప్పినంతలో సిరియాలు
పెడతలవెట్టుకొని తినయహంకారమునకు సిగ్గువడుచు దిక్కులుసూఁచు
చుండెను అప్పుడప్పరమకారుణికోత్తముండగు నమ్మత్తగజాసురారి
సిరియాలునారాత్ప యహంకృతిమాన్పించి నిమ్మవ్వసుతునకుఁ బ్రాణ
ములిచ్చి లేవఁజేసి తల్లినిఁజెల్లినప్రాణంబులం గొల్లగొని యుల్లసిల్లెదు
కొడుకునుంగలిపి కైలాసంబునకు రమ్మనిపిలుచు నామె" నాకు ముక్తి
యక్కఱలేదు భక్తియసాఁఖను. చరలింసేవయొనరించుచు నీభూలో

కంబునను యుండుఁడి"నని పోనాల్లని యాయిల్లాలికి, నామెసుతునకుఁ
చిరంజీవిత్వపదవి నొసఁగిన నాయవ్వయు సత్క్రియ లాచరించుచు
పుత్త్రుండునుం దానునుఁ దమచరిత్రములోకుల నేక విధంబులఁగొని
యాడుచుఁ గ్రీడించుచుండె నింకను నీనగరంబున జీవించుచున్నది ఈసిరి
యాలు నిమ్మవ్వలకథలు వినువారికి నాయుష్యాముత్తైనసుతులు గలిఁ
గి వారలుండుదురును చిరజీవులై యుందురు అట్లుశివుడానతిచ్చెఁ కథ
విని సిరియాలుకైలాసంబునకుఁ బోనుంకించుటఁగని మినుసిక దైవంబు
వ్రాసీక యాతనిగరంబునఁ దెమల్చి పట్టిరమ్మని జంగమవేషంబులిద్దఱుఁ
దాల్చి యింకయుభిక్షులఁజూడఁడగోరి హలాయుధపురమున కరిగిరి మా
ర్గంబునవచ్చువారల నల్లంతదూరమునఁ జూడఁగానే హలాయుధుండను

## హలాయుధునికథ

నప్పుడమి యెకిమీఁడుల్లాసంబుతో నెదురువోయి యర్ఘ్యపాద్యములొ
సఁగి గృహంబునకు దోతెచ్చి షడ్రసోపేతంబులగు పదార్థంబుల భోజ
నతృప్తులఁగావించి కుశలప్రశ్నసల్లాపంబులఁ బ్రొద్దుపుచ్చుచు, "హర
మూర్తులారా! మీ రెందుండి యిటకేఁగుదెంచితిరి మద్గృహపావనంబు
సేయునిటకే చనుదెంచితిరా? మఱియెందేనిఁ బోవుచు మార్గాయాసం
బపనయించుకొన నిటకరుదెంచితిరా? భవద్దర్శనంబున మన్మనంబున
కనుతాపంబు వృడమినది. నాచేఁ బూజలందుచు నింకఁగొంతకాలం
బుండుం"డను హలాయుధునికి హాలాభక్తుఁడును దక్షిణాకృపాకటాక్షం
బున నాతనివీక్షించి యిట్లనియె.

" భక్తాగ్రేసరా! మావంటిజంగమంబులను మీవంటిగృహస్థు
లేగదా సర్వదానిర్వహించెడివారు మేమొకచోనుండెడివారముగాము
భక్తులవలనఁ బూజింపబడుచు నెడతెగని సంచారమున నూరూరఁగల
శివవ్రతధురీణుల నిరీక్షించుచుఁ దిరుగుచుండెడివారము మేము భక్త
లెందున్నను వెదకివారిండ్లకుం జనియెదము. వారునుమమ్ముఁ దమ

ప్రాణలింగంబులని భావించి యనుభవించుచుందురు నీవెఱింగినతొల్లిం టిభక్తులలో నీలకంఠుఁడు కరికాలచోడుఁడు అర్యమయ్య, చంగళీమారుఁడు ఏకాంతనాధుఁడు చేరరాజు, వాగీశనైనారు సోమాసిమారఁడు పళ్లనయనారు, మొదలగుభక్తుల గృహంబులమేమర్చనంబుల నందినవారమె. మమ్మెఱుఁగనివారును మాకుఁదృప్తిగలుగఁ జేయనివారును భక్తులీలోకంబున లేరు మేమాదినిజన్మించినది నిరాలంబపురము, మాజననీజనకులెవ్వరో మాకుఁదెలియదు మమ్మునాఁటినుండి పెంచిపెద్దలఁ జేసినవారు మీవంటిభక్తులే మాకుశాల్యంబునందలయాటిసలుగిసి నీరోసి జలకమార్చిన దొకభక్తురాలు భక్తుండొకడు మమ్మును చిన్నప్పుడు కేలందేల్పట్టి నడిపించె. మాకుముద్దుమాటలునేర్పి బుద్ధిగలిగించినవాఁడు మఱియొకభక్తుఁడు కట్టవస్త్రములిచ్చిన వాఁడొకఁడు. భోజనముదినిపించినవాఁడింకొకఁడు గంతమిండలమై దుండగంబుననొకనాఁడు మేముపశుతుల యందుబవలింపఁగోరినపు డొకభక్తుఁడు మాకిట్టియి సుముఖులఁ బొందుపఱిచి మామున్దు సెల్లించెను జడలు దాల్చివిరాగత్వమొంది భక్తసంచారంబు సేయగమకించు మాకునొక భక్తుండు తనకూఁతు నూతనవివాహితకొప్పగొసి మాజడలకర్పించి మమ్మునిజమైన ప్రస్తుతజంగమరూపంబునకుఁ దెచ్చినయచ్చపుభక్తుఁడు వేఱొకండు. ఇట్లుభక్తులవలన నే సమస్తసదుపాయంబులఁ గనుచుమనుచున్నవారము ఇంతయేల మున్నశిరియాలుశెట్టి యీశ్వరునకొక గొప్ప విందొనర్చి తనబంధుమిత్రాదులగు పురజనంబులనందఱఁ గైలాసంబుఁ జూఱగొన్నవాఁడుగాఁడె? కంచిలోసిరియాలుఁడు భక్తసమారాధన నేయుచుండ నొకదినంబున శివుఁడాతనిమనంబులో తరయఁగోరి తనదూతలన నేసులఁబంప వారలవసపడితని వలపిసంత చెఱుకునిసమిచ్చి తృప్తులంజేసి యీశ్వరునింగెలిచె. మఱియు నాకంచిలోనే యిరువదియొక్క దినంబులెడతెగని వానఁగురిపించిన నెప్పుడును బదివేల జంగమదేవరలుం

డెడిపట్టణంబున నొకండును లేక యందరు నేఁగిరి అంత సిరియాలు జంగ
మాన్వేషణపరుండగుచుఁ దిరుగుచుండ గొండవిలుకాఁడు జంగమరూపంబు
నగపఱచి యాతని తనూభవుమాంసంబున విందుఁ గోర నతం డట్లొనర్చ
సంతసించి మఱల నాతని సుతు బ్రతికించి పురజనులందఱితో నాతని గై
లాసంబునకుం గొంపోయె. అప్పుడు మేమచ్చట నేయుండి కన్నులారఁ
గాంచితిమి. ఇది తథ్యము. రవంతయు వింతగాదు మేము చూచినదిగాని
విన్నదిగాదు అట్టిభక్తులీ భూలోకంబున నెవ్వరేనిం గలరె?" యని చెప్పు
చున్న యప్పరమేశ్వరునకు హలాయుధుండు "ఏమీ! సిరియాలుని శివు
డు జంగమరూపమున వచ్చి నీ తనయుని జంపి యామాంసంబు నాకుఁ
దినఁ బెట్టుమని నిజముగాఁ గోరెనా?" యని యడుగంగ నివ్వానివలె నడుగు
టయు నాగట్టురాపట్టి మగఁడు" నిజమే మేము గంటిమని చెప్పితిని
గాదా నీవు నమ్మవేని జూడుమాతనిచరితంబు లోకంబున పద్యకావ్య
ముగాను దృశ్యకావ్యంబగు నాటకంబుగాను వచనకావ్యముగాను మ
హాకవులచేఁ జేయంబడి బహుజనులచేఁ జదువంబడి వినంబడుచుఁ బ్రసి
ద్ధింపంబడి మెచ్చఁబడుచున్నది మఱియు నాటకము సూచునపుడు
పశ్యన్మహాజనులందఱు దమతమ తనువులం బులకలు గరింపఁగనుచుండి
యిట్టిభక్తులెందును లేరని ప్రశంస సేయుచుందురు. ఇంతియగాక పసుల
కాపరిపిల్లకాయలు దమసామ్ములు మేయుచుండఁ దారందఱొకచోఁ
గూడి సిరియాలుకథను బాటగాఁ బాడుచు నాటకమాడుదురు. స్త్రీలు
తిరుగలిము దఱబండి విసురునపుడును, రోఁకటఁ దంపునపుడును సిరియాలు
పాటయే పాడుచుందురు" ఇట్లని మఱిమఱి నెఱనమ్మకము పుట్టునట్టుల
సిరియాలుకథ నుడివెడు నాయుడుపనాయకశేఖరుమాటలు వినివిని తన
మనంబున ఘనంబగు కోపంబంకురింప ముఖము జేవురింపఁ బండ్లు పటపటఁ
గొరుకుచు. ఆహా! ఏమియాశ్చర్యకరమగు గాథ వింటిని దనుజుఁడు ది
నుమనుజమాంసమును శివుఁడు తినఁ గోరెనా? కోరెను పోదయావిహీ

నుండగు యమునివలె సుతుం జంపం దండ్రి కెట్లు బుద్ధిపుట్టెను? పుట్టెను పో
రక్కసివలె తల్లియు నెట్లుల్లసితభావంబునం దనచేతులారం గన్నకొడుకు
నుం జంపించెను తనతనూజుడైనను వానిం జంపుటకు వీరికేమి స్వాతం
త్ర్యముగలదు? ఒకనిజీవంబును బోంగొట్టి నొకనికిహెచ్చగలదా? తుద
కుం దనజీవమును దాను తీసికోలేము ఇట్లు నిజీవత్యాగము తనంత దాం
జేయువాం డాత్మహత్య యను పాపఫలం బనుభవింపండా. పరజీవహంత
యునట్టి యధికపాపభాక్కగును ఇంతకు నరమాంసముం దెమ్మని శివు
డు గోరెను గాని సూనునిం జంపుమని కోరలేదుగదా? అట్టిచో శిబిచక్ర
వర్తివలెం దన దేహంబునం గండలుకోసి వండించిపెట్టంగూడదా? బిడ్డనిజీ
వముకన్నం దనజీవము హెచ్చగునా? పూర్వమొక కోంతి తనపిల్ల కడుపున
వ టుకొనియుండంగా నొక కాలిన పెనము దెచ్చి దానిపై నా కోంతిని బల
వంతముగ గూర్చుండంబెట్టి నదికడుపుననున్న పిల్లను దిగజార్చి యా పెన
ముపైం బడవైచి దానిపైదాను గూర్చుండెను తనముడ్డి కాలకుండున
ట్లుల పిల్లనడ్డువెట్టుకొన్నదిగాని దానిబాధ కనిపెట్టినదిగాదు కనుక నేమ
ర్కటకిశోరన్యాయమునం బిల్ల తెట్టిగాని తల్లిపట్టులేదు. అప్పుడు పుట్టిన
పిల్లయైనను దన్నుం దాం గాపాడుకొనవలెను గాని తల్లిగాంపాడదుగదా?
అట్టితల్లియే యీసిరియాలునాలియు కనికరించును మాటలేక పాపభీతి
రివంతయుం దోంపక సుతునిం జంపె వారి భక్తియననెంత? అట్టి మూఢ
భక్తిం బరీక్షింపంబోయిన యామూఢజంగమము యొక్క దైవత్వమననెం
త? ఇట్టి బహువ్యసనకరంబగు ఘోరకృత్యం బాచరించిన యాశివునకు
సిరియాలునకుం బ్రమథగణంబులకు వెలిసుమండో జనులారా! యనిమ
హాకోపంబున ఘంటానాదంబుసేసి బాహువులప్పళించి తోడనం దన
సింహనాదంబున లోకంబునం జాటింపెను అప్పుడు సిరియాలును
దమపై కేమివచ్చునోయని భయపడుచుండ జంగమరూపంబున వచ్చిన
వారు గానమిమ్ము మన్నింపవలసివచ్చినది గాని, లేనియెడల మీరును

దద్బహిష్కారార్హులౌతె" యని మాడిపడుచు శివుఁడు ముదిసినమతిచెడి తొండముదిరి యూసరిపుల్లియైనటులఁ దాను దానవుండయ్యెను. రాక్షసులచే నుపాసనీయుండగు దైవంబునకు రాక్షసత్వమె సిద్ధించునుగాని దేవత్వమెట్లునిల్చును? నరాముఁడు సేయుకృత్యములు నరాదకృత్యములుగావా? కనుకనే యట్టికృత్యంబు సిరియాలుచేఁ జేయించెనని చిందులుద్రొక్కుచుండెను అదిచూచి సిరియాలును సిరియాలు నేస్తుఁడును సిగ్గునమొగంబులు వంచుకొని యొకమూల నొదిగికూర్చుండిరి అప్పుడు పినాకి తనమనంబున దిగులొంది మఱియు హలాయుధుని నామవచనంబులఁ దానోడఁబఱచఁజేయలేమిని శ్యామలాంబను మనంబునఁ బిలుచుకొనెను

అంతనా హిమవంతునికూఁతురు పెనిముత్తైదువయగు జంగమభక్తురాలి చందంబున నందంబగు మేన పసుపుపూసి కుంకుమబొట్టు పెట్టి భ్రూమధ్యంబున విభూతిరేఖవనర రుద్రాక్షమాలలు మెడఁదాల్చి శివస్మరణపూర్వకముగా నచటఁ బ్రత్యక్షంబైన, హలాయుధుఁడు దెసకేగి భక్తివందనం బాచరించి యుచితసత్కారంబుల లోనికిఁగొనిపోయి యాసనాసీనంగావించిన నాయమయు నాతనిసంబోధించి "ఏంటివా హలాయుధా! విష్ణువు తన భార్యయగులక్ష్మిని వక్షస్థలంబున నిడుకొని కాపాడుకొనుచుండెను బ్రహ్మ సరస్వతిని ముఖమందు ముచ్చుకొని యానందించుచున్నవాఁడు ఇట్లయినను లక్ష్మీసరస్వతులకు జాతినీతులులే నిఖిలజాతిపురుషులను దామువరించి వారితో వివహరించుచున్నవారు. అట్టి వారలస్థితియె యట్లుండఁగా నీకలోకములో స్త్రీలకెక్కుడ యింగితజ్ఞతగలదనిచెప్పవచ్చును సర్వకాలసర్వావస్థలయందుఁ గందర్పహరుని యర్ధాంగంబుననుండి పరపురుషులఁ గన్నెత్తియైనఁజూడని పార్వతియొక్కతె లోకములో మహాపతివ్రతయనిచెప్పవచ్చును అట్టిపార్వతివ టిదానను నేనునిన్నుఁ జూడవచ్చితిని. హలాయుధుండను శివభక్తాగ్రేసరుఁడు

జంగమభక్తులకును, భక్తురాండ్రకు నేమికోరిననది యెల్లనిచ్చుచున్న వాఁడను ప్రఖ్యాతి లోకమంతంతటను వ్యాపించినది ॥ అని చెప్పుచున్నయ వ్వార్వతిమాటలువిని హలాయుధుఁడు" భక్తులలో నధమాధముఁడను నేను నన్నిట్లునుతింపవచ్చునా తల్లీ! ఇచ్చుటకు నేనెవండను? మీభక్తి యమీకునసమస్తంబులిచ్చును. ఇఁకేమిగావలెనో కోరుమమ్మా ॥ యని హలాయుధుండనెను. అంతనాయగజయుని గజగమనంబునకు ననువగు పాదంబులు నేలమోపి లేచినిలువంబడి చేతులుమోడ్చి ఆవెంటనే సిరి యాలును లేచినిల్చి కైదోయిజోడించి నేలకొరిగి సాష్టాంగంబుగా న మస్కరించుచు ప ॥ ఓయి హలాయుధా! నీవు శివపూజాధురంధరుఁడ వు పరమపవిత్రగాత్రుఁడవు లింగసంగతుండవు నిష్ఠైవుండవు భక్తు లయెడను రక్తుఁడవు ఇట్టి సుగుణశాలివిగనుక నే నీ నేను భక్తురాలివే షంబున నన్నుమెచ్చితివి. ఆసమయమున గళించిన కన్నుల బుట్ట వికసింపం జేసి నిట్టిగానేన గాత్రంబుపైనునిచి" నన్ను విన్నము నిజమొత్తిం గించెను నేనుమానినిగాను ఈశానునివామభాగంబునుండి నీవంటిభక్తులగడంచి రక్షయుమదసు శ్యామలాదేవిని ఈజగము రూపంబులకుఁ గన్పడి ముప్పని చేతులుజోడించి నీకుసాష్టాంగ దండంబు పెట్టుచున్న యీభక్తురాలుసిరియాలు అవ్వలనెవ్వగనివ్వటిల్లెడు మానుకొనిపోయిన యెడపువ్వులో చిన్నవ్రాయిన మొగంబుతోఁదల వాల్చుకొని నిల్చియున్నయమ్మహానుభావుఁడౌ నుమిాహలాయుఁడు నీ దృఢభక్తికి మెచ్చి వీరిద్దఱును వేషంబులనచ్చి నీకులోఁగి నీచేనిర్జింపఁబడి యోడితమని సిగ్గునిట్లోనూఁగాడ నేఁటికనన్ను బలంచుకొనిన నేవచ్చి యున్నరూపు నీకెఱింగించితి ఇఁకనీవువారలను గారవించిచమ్ములనను పుము పోయివచ్చెదమనిన హలాయుధుండు లజ్జాననతవదనుండై ॥ శివా భవా, యభవా, మృత్యుంజయా, కాలకంఠా, భక్తపారిజాతనా శాస్త్రేయపశుపాలకా! పశుపతీ, మాయాజంగమరూపంబున నాసదనం

బున క్రరుదెంచి నన్ను మాయసేసిభ్రమపెట్టి లేనిబోనికాఱుకు తలు
నాచేతఁగూయించి నన్నోడించి నేనొంకవలసినలజ్జాభావము నీవహించి
యేమియుమెఱుంగనివానివలె నిలుచుంటివా? మిక్కిలికంటిదేవరా! ఈ నీ
వ్రునరించిన యీయసంగతిపుపవికి నీవాయూసపడి యింతప్రయత్నం
బున నీపెరియాలుంగూడ వెంటఁబెట్టుకొనివచ్చి యీపాట్లుపడుటేమొగాక
యెక్కడోకైలాసంబులోనున్నని మాయమ్మనుగూడ నిటుచరావిం
చితివా? హా! మఱచితిని. ఎటనోయున్నదననేల? నాదిపొరిజాటు నీవు
పరశివుండవు. ఆయమ్మనీవామభాగంబునవె యున్నదికాదా? దాననే
గదా నీవుసర్వదాయర్ధనారీశ్వరుఁడని జగత్కీర్తితుండవు నేనుధన్యుం
డను. బహుజన్మకృతసుకృతపరిపాలకుండవు నీవుతొలుతనే నీనిజరూ
పంబునకు గానుపించినదో నామూఢత్వంబు లోకులకెట్లుగోచరింబ
గును మఱియుభక్తులమహాభావంబునడంపఁ జెలువొంద యిట్టివేష
బాబులు నీకుఁజెల్లుచుండును చాలు! ఇంకనైన నీయుద్ధృతిః మయం
బగు నీనిజాకారంబునాఁ జూపి నన్నుకృతార్థుని జేయుమయ్యా, లేవ
య్యా" యని భగవంతునితోఁ బ్రసంగించి పడియున్నపెరియాలుం దనకే
లలేవనెత్తి "లేవమ్మాయి పెరియాలూ! నీవంటిభక్తుఁడీము ల్లోకములలోఁ లేఁ
డునిజము నీవిట్లనుకొనుటకుఁ దగినవాఁడవె ఆయినను మన ముట్లనుట
మనయహంభావమును వెలిపుచ్చును అహంకారముమాయ దాని జ
యించినవాఁడే మాయనుజయించినవాఁడు భగవంతుఁడుభక్తులయ
హంకారమును దొలఁగింపఁదేని తనభక్తవత్సలత్వమునకుఁ గళంకము
వాటిల్లును గనుక నేనీయహంకారముఁబోగొట్టవిన్నుఁ నాయొద్దకుఁ
బిల్చుకొనివచ్చి మఱికొద్దిఱకుఁదగినబుద్ధిసెప్పెను నీచరిత్రసకలజనంబు
లును బండితపామరులు స్త్రీబాలురు పాటగాను పద్యములుగాను బరిం
చుచుండుట నీనాటకమాడుచుండుటయే నీభక్తాగ్రేశరత్వంబునకు సా
క్షి ఇట్లుపెరియాలుతో ముచ్చటించుచున్న సమయంబునఁ దబ్బింబ

కుంకుండు భద్రరథారూఢుండై శూలవజ్రఖడ్గాద్యాయుధంబులతో
జటాజూటంబులతో, నద్దాననెలకొనియున్న గంగావాహినితో, పన్నగ
శిఖాపాశముతో చంద్రచూడామణితో భసితవిభూతికోలతో రుద్రా
క్షమాలలతోఁ గపాలభిక్షాపాత్రంబుతో నభయహస్తంబుతో నభ
టఁ దోలుత జంగమరాలిరూపంబున హలాయుధునికిఁ గన్పడి తోడ
న యత్యపూర్వంబై యీశ్వరుని వామార్ధాంగంబునదూర ముసిముసి
నవ్వులతోఁ తొంగిచూచుచున్న శ్యామాదేవితోఁ బొడసూపెను.
హలాయుధుండును సవినయభక్తి నమస్కారంబులుగావించిన నించు
తల్లునిఁ గొంచపఱచిన పంచముఖుండు "హలాయుధా! నీభక్తికిమెచ్చి
తి. తెమ్ము. రమ్ము కైలాసంబున" కని యంతనిలువక సకలజనంబు
లతో నతండేలు నవపురంబులలోని సకలజీవులను నాలుగంగుళముల
లోతువరకు నూళ్లతున్నను పెల్లవెల్లలుగాఁ దీయించి కైలాసంబున
కుఁగొనిపోయెను. ఇట్లు శివయోగులకు గలిగించిన యుత్సాహభావమునడచు
టకు నిటలనయనుండు హలాయుధుఁ గల్పించె, యూడగన్నాటకి
సూత్రగారుఁ ఢీకపటనాటకమాడెను కాన నీకథవినువారును జదు
వువారును వెఱవారికిం జెప్పువారును హలాయుధునివలెఁ గైలాసంబు
నొందెదరు. కావున నోబసవకుమారా! భక్తులకెన్నఁడైన నపాంరోర
ములౌనునా?

## మరుదుండునికథ

మఱియుఁ జెంగొండయను నొకపురంబున మరుదుండండను నొ
క మహాభక్తుఁడు గాపురముండెను అతండులింగసంగత దేహుండు.
భక్తార్చనారతుఁడు. నిర్వికారి. నిరహంకారి. నిస్తులుండు భక్తిభావ
ణుండు. ముక్తసంగుండు సత్యంగసక్తచిత్తుఁడు దైవికసామర్థ్యసంప
న్నుఁడు శివానుగ్రహాదక్షుంబగు తపోమహిమగలవాఁడు. ప్రతిసంవత్స
రము బహునిష్ఠతో శివరాత్రివ్రతముసలుపువాఁడు ఇట్టిమహానుభావుఁ

డగు నామిష్టున్నుండ ననునారు తనయూర శివరాత్రిదీక్ష యేకాధ్వరమ్ముగా
బండ్రెండువత్సరములు నిచ్చిలు వచ్చుపుబత్తి నొనరించి పదమూఁడవ
యేఁటఁ దిరువారూరను గ్రామంబునకు బోయి శివరాత్రిదినంబున నందు
న్న వల్మీకేశ్వరుఁడను మహేశునిఁ గొలువఁ దదాలయంబున కరిఁగి యచ
టనున్న శివభక్తులతో నిష్టగోష్ఠిం గాలక్షేపంబు సేయుచుండెను. ఆస
మయంబున న్నాపురంబునఁ గలనంబియను నొకధనికుండు సంతతవేశ్యా
లంపటుండు జారశిఖామణి తనపరిజనంబు లిరుదెలంకులఁ గొలువ కవి
గాయకజనుల స్తోత్రపద్యగద్యగీతంబులఁ జదువుచుఁ బాడుచుఁ జేతుల
మద్దెలల తాళంబులఁ గొనినవారు తాళంబుల వాయించుచుఁ దమకాక
దెలుపుచుఁ దోడ రాఁ దానొక యాందోళిక నెక్కి వేత్రహస్తులు దారి
సేయుచు ముందు నడవ శివభక్తులు గొందఱు ద్రవ్యాశచేఁ దన్ను బహు
విధంబులఁ గైవారంబులు సేయుచు దీవనలిచ్చుచు ననుసరింప మహావై
భవంబుతో గుడికిఁ బోయి వాకిలిఁ బల్లకి డిగి లోనికేగి చూచెను భక్తుల
నైపు దిరిగి మూఢాత్మ నిర్లక్ష్యభావంబునఁ దనయుంపుడుకత్తెను మనంబు
న ధ్యానించుచు దానివిలాసంబులం దలంచుచుఁ దనలోఁ దానె నవ్వుకొ
నుచుఁ దనయీడుఁ దానె మాచుచుకొనుచు నతివేగంబున గర్భగో వెలలోని
కిం బోయి దేవునిఁ దనపడియుమ్మని యడుగుచుండఁగా మురుమిండనయ
నారదిగని "వీఁడెవ్వఁడు దిగ్గజంబులవంటి పరమశివభక్తు లిట నుండఁగవా
రలం గనకె గౌరవింపక సగర్వంబుగా నిటు బోవుచున్నవాఁడు వీఁడెవండు
భక్తుల ననాదరభావంబునం బరిహరించి గుడిలోనికిఁ బోవుచున్నవాఁడు.
ఇట్టివీనిగర్వమును సర్వమంగళాధవుండెట్టు సహించె? శివుఁడలిఁగిన భక్తుఁ
డు కాయఁగలఁడుగాని, భక్తుఁడలిఁగిన శివుఁడు గాయఁగలఁడె? చూత
ము వీనిపంతంబు. తత్క్షణమ్ము బైటకుఁ దఱుముఁడు. ఇది వీనిసాహసమో లేక
యూ దేవునిమన్ననయో" యని వానిమెడబట్టి యర్ధచంద్రప్రయోగము
సేయ నుంకించునవసరంబున నాగుడితంబడి [పూజారి] పరుఁగుపరుఁగున

బాఁగుబాఁగు వానిజోలికిఁబోకుఁడని యూమరుమిండనయనారిపాదంబు
లంబడి సాష్టాంగదండంబు వెట్టి చేతులుజోడించి" దేవా! వీనిమీఁ రేఖం
గరా ఈనల్ని కేశ్వరునిముద్దఁడు. వీనితో నాదేవుఁడు ప్రీతివినమునిష్ట
గోష్ఠిఁబరుపుచుముద్దుసేయుచు దినమునకువేయినిష్కంబులు వానియి
ష్టానుసారము భోగించుటకిచ్చుచుండును వీనివంటివిటుఁ డీలోకంబునఁ
గాదేలోకంబుననుండఁడని నానమ్మకము వీనివేశ్యకును వీనికినిదగవు
వచ్చినపు డీశ్వరుఁడు తగవరియై మధ్యనిల్చి హాస్యరసంబులగు సరసస
ల్లాపంబుల వారలఁగొలుపుచుండును. వీనిజారత్వమును దానెట్లుస
హించెనో ఆజారత్వమునకుఁదగినధనము దినమునకువేయినిష్కములిచ్చు
నని తొలుతమనవిసేసికొనియెయుంటిని. "శ్లో. దాసోహమానధనాహంతి
వేశ్యాధనార్థికం ఆయూంషివినవాహంతి సర్వంహంతిపరాంగనా!" అ
న్నటుల వేశ్యాలంపటునకెంతధనమునుజాలదు అందుకనియె దినము
నకువేయిమాడలధనమిచ్చుట జారులనుశిక్షించుట్లు జారమాత వీనిజార
త్వమునోర్చుట యాశ్చర్యము ఏమీ యాశ్చర్యమేమీ! దారువనముని
మానినీమా ధనాపహారుండగు నమూన్మకసంహారకుండు వీనిజారగుణంబు
నహించుట యొకవింతయగునా? జారుఁడుజారులనేగదా మెచ్చును.
వారలనేగదా చేరదీయును " అనిచెప్పుచుపురాజారిమాటలువిని "ఓహో
యిట్టివాఁడా యీబూచులతేఁడు వీనినఁబనియేమి ఇట్టివానింజేరఁదీసి
గర్వోన్మత్తునిఁజేసిన యీశంభునిదితప్పు కనుకనో భక్తులారా! నేఁటి
నుంచి పంచశరసేవకునికి ననుంగుఁజెలికాఁడగు నునపంచశరారికి, వాని
గణంబులకు వెలిబెట్టుదము లెండిలెండిమనముపోదము. గుడి[illegible]దుం
డునలదని "ఘంటానాదంబున వాదువెట్టిభక్తులతోఁడం దానును వెడలి
పోవుసమయంబున నాగచర్మాంబరుండు మెండగుసిగ్గుతో నాదేవళం
బందుండనోడి, భక్తులుసూడకుండునటులును పురాజారుల కనుమొఱఁ
గియు సూక్ష్మరూపంబున నంబియఁ దన్ననుసరించి వెంటరాబయలు

వెడలుమార్గంబుగానక భక్తులుగనిన నవ్వదరనుసిగ్గున నగ్గలికంబగు
నెవ్వగముదిగదుర గర్భగుడినుండి సోమసూత్రద్వారంబున బయటవచ్చి
యంతటమంటపదీపస్తంభంబుల నీడలందనువుదాచుకొనుచు మొగం
బునఁ జేతమూసికొనుచు గోపురద్వారంబుదాటి గుడివెనుకకుఁజని యా
తెఱువునఁ బాటిపోవుచు మార్గమధ్యంబున నొకగండశిల చతుష్కో-
ణంబులుగలది యడ్డుపడియున్న దానిఁగండ్రించి యారంధ్రంబున
దూరి యవ్వలనని వెనుకకుఁదిరిగి చూచుచునదరిపడుచు బెదురుగుండె
యగలవాఁడై పోయిపోయి యెదురనొక నానావిధతరులతాగుల్మంబు
లను శుకపికాదివిహంగమమృదుమధుర రవంబులను పుష్పఫలనుగంధ
గంధురత్వంబునను హరిణశంకురామమరుశశాదినిర్వ్యాపకమృగసంకుల
త్వంబునను మనోహరంబగు నుద్యానవనంబుగని యందుసందందసంచ
రించుచుఁ దావచ్చింతోఁదానెఱుఁగక తిరుగుచుఁ గొంతదూరంబున
నిర్మలనీహారశీతలసలిలపూరంబును కమలకుముదశైవాలభారంబును హం
సకారండవాదిజలవిహగసంచారంబును మత్స్యకూర్మాదిజలచరవారం
బును మణిమయసోపానతీరంబును దేవతావిహారంబునగు నొకకాసారం
బుగాంచి దానితటంబుల నలుదిక్కుల నక్కజంబులగు జంబూ ప్లక్ష
సాల, రసాల తమాల తాల హింతాల పనస ఖర్జూర, పూగ నాగరంగ
నాళికేర నింబ రంభాది భూరుహచ్ఛాయలం గలయఁదిరుగుచు దివ్యల
నొకసంతాన మహీరుహంబుఁగని దాని ధౌతమయకాంతింగని దూరం
బునుండి చూచినదిగనుక దావిడిచివచ్చిన గుడిమానితొలుతభ్రమించి
విరామించి యందలిఫలపుష్పంబులంగని దేవభూజంబుగానెఱిఁగి దాని
నీడను విశ్రమించి యెదపై చెయ్యిడి బ్రదుకుజీవుఁడాయని యూపిరిని
గుడించుచుఁ గొంతవడికి శ్రమదీరఁగన్నులుమూసి నిదురించువానివలెఁ
బండుకొనియుండెను అంత నానంబి మనంబునంగల గర్వంబపనయించు
కొనిభక్తులకోపంబునకు భయపడి భగవంతుఁడా పాఱివచ్చినప్పుడు తన

గతియేమగునో యనుభయంబున నంబాసతితోనిట్లను "అయ్యా! నీకే లయిట్టి భయమునొంద నిందులకేతెంచుట. నీకేయిట్టి భయమున్న నాగతియేమగును?" అని యడుగ నామృడుఁడు "నాయనా, యేమిచెప్పను భక్తులునారూపము నేనువారిరూపమను. వారునాకు వెరవరు గాని నేవారికి వెరతును వారిసంతోషము నాసంతోషము వారిదుఃఖము నాదుఃఖము వారినిఁబూజించిన నన్నుఁబూజించుటయ వారికిచ్చిన నాకిచ్చుటయె వారలెనాప్రాణంబులు నేనేవారిప్రాణంబులు. నేనలిగిన భక్తులుగాయఁగలరు. భక్తులలిఁగిన వారిని నేఁగాయలేను భక్తులతప్పులు భక్తులే మన్నింపవలెను. భక్తులనుదూరుట నన్నుదూరుటయె. స్థావరజంగమ లింగపూజలు రెండును జేయవలెను జంగమలింగపూజ లేని స్థావరలింగపూజయేల? అదినిరర్థకము భక్తులె జంగమలింగంబులు, స్థావరలింగంబు నేన నీవుస్థావరలింగనిష్ఠదృఢభక్తుండవు జంగమలింగభక్తివిముఖుండవు. విశేషించి జంగమలింగద్రోహివి. నేనుభక్తవత్సలుఁడను. భక్తవిగ్రహుఁడను భక్తపరాధీన మనస్కుఁడను భక్తాశ్రితుఁడను. భక్తసేవకుఁడను. అదియెట్లన్న వినుము

## బాణుని కథ

తొల్లి బాణుఁడను భక్తవరుండు చతుస్సముద్ర ముద్రితమగు భూమినిఁబరిపాలించుచు సర్వంసహా సమస్తజనంబులకు వలయుపదార్థంబుల నిచ్చుచు నర్థిజనకల్పద్రుమ బనఁ బేరుపొందిన బలిచక్రవర్తి నూర్వురుపెనయాలలో నగ్రసుతుండు దినమునకు వేయితడవలు నాపూజసేయుచుండెడివాఁడు, అట్టివానికి నాపూజకే కాలము చాలకపోయియుండుటచే రాజ్యభారముఁ జూచుకొననవకాశము లేకుండుటచే నేనాతనికిఁ గరుణించి ఏకకాలమునందే నాసహస్రావృత్తిపూజ ముగియునటుల వానికి సహస్రకరంబుల నొసంగితిని. వానితో వాఁడు సహస్రావృత్తిశివపూజ నొకనిముసంబులో నొనర్చువాఁడు అట్టివానికీర్తి లోకమందం

తటను వ్యాపింప వానిఁజూఁచుటకు భక్తగణంబులు తదితరులు నయుత నియుతసంఖ్యలు బయలుదేఱ నారంభించిరి వారలతోఁ బ్రసంగించు చుండ నాతనిఁ బూజాభంగమగునను దలంపున నే నాతనిపూజ ముగిసి యతఁడు ప్రసాదము స్వీకరించువఱకు నాతనిద్వారముకడఁ గావలి యుండువాఁడను గానా.

## కరికాలచోడుని కథ

వెండియుముదిగొండ యనుపురంబును బాలించెడి కరికాలచో డుఁడను చోళదేశపురాజు కావేరింగట్టి దిట్టతనంబున నింటికొకరుచొ ప్పున వెట్టితట్టలుమోసి మట్టి తెచ్చి గట్టువెట్టుడని నియమించినఁ బట్టువు భక్తికిమెచ్చి తానును బురజనులతోఁ బాటు వెట్టితట్టలుమోయ లేదా? మఱియు స్వామిభృత్యసంబంధంబు దిగనాడి నంబియనువాఁడు వేశ్యనుం చుకొని నిశ్చయంబుగఁ జరించుచు స్వామి చేత నే యూడిగంబులు సేయిం చుకొనుచుండ నూరిలోనివారేమియు వానినాన వెట్ట లేక యూరకుండిరి నునపవాద తనచే వినఁబడకుండ దాగియుండెడి కరికామదేవుని కథవిని నట్లకాపాడివచ్చితిని ఆకరికామదేవునివలెఁ గాక నే నీయూరిజనంబుల తో వికటించక వారలలోఁగలసికొని యేకభావంబున మెలఁగుచుంటి నిగానా? నేనేమి? మీ తాతకుమాతాతకు యచ్చియున్నాఁడా? నీ మె డల నేనేల యింతభక్తి చూపవలె నని నీవడుగ బదులు సెప్ప లేక నీభక్తికి మెచ్చియేకదా నేనన్ని పనులకొడఁబడి నీయూడిగంబులు సేయుచుంటిని నేఁడునీవు నాభక్తులలో నహంకరించి వారలధిక్కరించితివి ఇఁకనీవెట్లు బ్రతుకఁగలవు? నేఁగాయ లేను "సంసర్గయాపాపగుణాభవంతి" యను లోకోక్తి సార్థకంబయ్యెను నీతోటిసాంగత్యంబున నాకు నాభక్తులలో దలవంపులాయెననుచు ననేకనిదర్శనంబుల భక్తులమాహాత్మ్యంబులును వారల దివ్యచరితంబులును నుగ్గడించు నాయుగ్గికను దేవరకు మ్రొక్కి" దేవా! దీనదయాపరమూర్తీ! నేనపరాధంబు సేసితి నన్ను మన్నింపుము.

భక్తులకు నాపైఁగినుక పొడమినది గనుక దాని నాభక్తులవలన నేటో గొట్టివారల ప్రసాదంబునకుఁ బాత్రుండనయ్యెద నిఁక నెన్నివిధంబుల నయినను వారింబ్రతిమాలి మ్రొక్కి ప్రసన్నులం జేసికొనియెద" ననిబ యలువెడలి పురాభిముఖుండై తాళంబులువాయించుచుఁ బడిపడి దండంబులంబెట్టుచు భక్తి చరితంబుల గీతంబులం బాడుచుఁ బురంబున కేఁగుచు నందరుభక్తులు విను తెఱంగున వేఱవేఱ భక్తులచర్యల ననివార్యసింహనాదంబున నిట్లని వేఱవేఱ గణుతింపం దొడంగె నెట్లనిన.

## ఏణుమూరితి కథ

ఏభక్తుండు నిత్యముఁ ద్రికాలములయందు నిందుజూటునకుఁ జందనసమర్పణంబు సేత యొకనియమంబుగాఁ గలవాఁడై యెట్టకేలకు గంధసంపాదనమునకు దనకుధనంబు లేమి నిజమనంబున ధనసంపత్తియొకసంపత్తియె భక్తిసంపత్తియ నిజమగుసంపద. అట్టిభక్తి నాకుఁ గొదువయగుటనె గాఁబోలు శూలపాణికిసమర్పింప నాకు దివ్యగంధం బలవడకున్నది. కాసి, నా దేహమంతయు గంధంబుగానరగఁ దీసియీశునకర్పించెదనని తనకుడిమోఁచేయి గంధపుసానపై నుంచి లింగోదకంబున నరగదీయ, దేహమున కేమియు నాయాసము లేక చేయియరగక రక్తముగారక రంగుమారక దుర్వాసనగాక శ్రీచందన గంధంపు వాసనగలిఁగి ముద్దముద్దలుగా గంధంబుబయలు దేర నాచందనమును దండశూకభూషణునకు సమర్పించి జనులందఱు సూచుచుండ దివ్యవిమానారూఢుఁడై కైలాసంబుఁ జూఱఁగొనెనో యట్టియేణమూరితికి దాసానుదాసుఁడను.

## దవలనంచి కథ.

తనప్రాణలింగమునకు నిత్యమును వేయివత్తులు చమురునందడి పి దీపసమారాధన సేయుటయె యొకనిత్యవ్రతముగాఁ గలయొకభక్తుఁ డుదీపమునకుఁ జమురుసంపాదించుటకు ధనంబులేమిఁ దనువునలేనినూనెమతియెందుగలదు? అట్టినాతనువును వెలిఁగించి దీపారాధనమొనర్తు

ననని కేశపాశమును నిరవకాశముగ బంధించి కొనలననువుగ వెలిగించి నిశ్చలుండై యాదీపమును పాపతేనిసామ్ముల ద్రొరకునమర్పించి యుండఁజూడ విమానారూఢుండై యారూఢింగైలాసమును జూచిఁ గొన్న యాడకవల నంబికింటి పనులుసేయుబంట నయ్యెదను.

### గుగ్గులకళియారి కథ

ఏమహానుభావుఁడు నిత్యమును వనపాపలింగమునకు సృకధూపంబు సమర్పణసేయుచు నట్టిధూపద్రవ్యము ను సమకూర్పుటకుఁగా నిల్లునమ్మి పుస్తెపూసలుం గొడువపెట్టి తుదకుఁదెగనమ్మి యదియుం జాలక చింతించుచుతఱిఁ దిరుపకుం డామనుపురంబు పాలించు రాజు తాను నట్టివ్రతంబుగైకొని పెట్టలేక చిక్కుపడుచుఁ జింతిచుచున్న యవసరంబు నఁదావటకేఁగి నిచ్చలుంగొల్లగ గుగ్గిలమిడిన నాధూపంబున నీశునిఁదృప్తి సేతునని యొప్పించి యాగుగ్గలముందెచ్చి శివాలయంబున కేఁగి యందునాగుగ్గిలము ధూపముపై వియొక కొత్త చీరఁదెచ్చి దానిరెండుచెంగులు శివలింగమునకుఁ బ్రొట్టుముడి వెట్టి కడమ రెండుచెంగుల నొకమంచి దానుగలకత్తి నంటగట్టి గొంతుకత్తిఁ దమెడకుఁదగిల్చుకొని "ఓదేవా! యింతదనుక నిర్విఘ్నముగా నాంబ్రాణిధూపము నీకు సమర్పించు నేనిత్తఱి నే నదియర్పింపలేక నాసిగ్గు నేనపొందుచు నట్టి నాయసామర్థ్యజీవనమికేల "యని గొంతుతఁగుగుకోనుచున్నా" నని వెనుకకొలుగ, నీశ్వరునికటాక్షంబునఁ గళ్యాణకాకారమును కైలాసనివాసంబును గన్నవాఁడయ్యెనో యాగుగ్గిలకళియారికి సేవకాధముఁడనగుచున్నాను.

### అరివాలుని కథ

నిత్యమును శివపూజాకాలమునఁ గాలగళునకు మహానైవేద్యము రాజనమల బియ్యపుటన్నముగాని మఱియొకరకము బియ్యములోవండిన యన్నంబిడనని యొకవ్రతంబుపూని కాలక్రమమునఁ బేదఱికము

నమునిం గి యట్టిబియ్యమ్ముచే కూరమ్ముం గొడవలిపట్టి కూలిచేసి తనకూలి
వేతనముకుం గా నారాజనాలబియ్యమిచ్చు నిర్ణయంబు సేసికొని, యా
తీరునఁ గొన్నిదినంబులుగడిపి తుదకు వియును దొఱుకక వ్యాపకము సేసి
యైదుదినంబులు తండులాభావంబున కటికియుపవాసంబు సలిపి యాఱవ
నాఁడు చేరెడుబియ్యములభింపఁగా నవియైన స్వామి నివేదనంబొనర్తు
నని వేవేగ నింటికిఁజనుచు మధ్యమార్గంబునఁ గాలుజాఱిపడి యాబియ్య
మంతయుఁ గలియఁ గసుకీనత విచారించి, "ఛీ, బియ్యమైన శివునకకర్ప
ణసేయఁజాలని నాబ్రతుకేల" యని ప్రాంతమున్న కొడవలిఁదీసి మెడ
కుఁదగిలించుకొని కోసుకొనయత్నించుతఱిఁ బ్రమథగణంబులతో, ఫాలనే
త్రంబుతో శ్యామాలింగితవామాంగంబుతో నగజదమనుండు ప్రత్య
క్షమై కైలాసంబునకుఁ దోడ్కొనిపోవ పునర్జన్మరాహిత్యమగు శాశ్వ
తపదవి నందె. భక్తుఁడు నిత్యజీవియై మనుచున్నాఁడో యాయరిపాలున
కంగి భక్తి పరిచర్యలు సేయు దాసులదాసులకుం దాసుండను

## ఉడిభక్తనయనారి కథ

పాండ్యదేశమునందున్న యేయుడిభక్తనయనారను భక్తుఁడితర
వృత్తులనేమియు నెఱుంగక వలఁగొని చేఁపలుపట్టు వృత్తినవలంబించి
జాలంబులోఁ జిక్కినతొలిమీలను శివప్రీత్యర్థంబుగా విడిచి రెండవత
డవదొరికినవె యమ్మి యాధనంబున జంగమార్చనలు సలుపుచుండ
నొకతరి యైదుదినంబులు వేటసాగక డస్సివసికి యాఱవదినంబున
వలఁబుచ్చుకొనిపోయి యొకతటాకంబున వైవనందునొక బంగారుమీను
చిక్కిన దానిందీసి మఱలనీటఁబడవైచి పునర్జాలవిసర్జనంబుసేయ మఱల
నదియెదగులుకొన్న దానిబోవిడిచి యెన్నిమారులు వలవైచినను నాచే
పయే దొరుకుచున్నందున నాఁడునైతముపవసించి యేడవనాఁడు వేఱొ
క స్థలంబున జలచరంబులతో మిగులడంబుమీరిన యొక పెద్దసరోవరంబు
న వలవైన నాఁటిదినంబునను తొలినాఁటి పైడిమీనె చిక్కె తొల్తవిడు

నంబడి, మఱలవిడువంబడిన వలలోనదియె చిక్కువడి యిట్లన్నిసారులు వలవేఁటయొనర్చిన నన్నిసార్లు నదియె తగులుచున్నందున నాఁటిదినం బట్ల యట్లనె పైఁచి పదునాఁ డష్టమదినంబున వలఁగొని వేఁటాడఁబోవుచు "నేఁటికినింబునఁ జేఁపలుదొరకవేని మఱివఁజేపట్ట" నని భీష్మించి విను చుట్టయు బ్రహ్మాది మహాఋషిగణంబులను దనమాయ యనెడివలలోఁ జిక్కువెట్టుచున్న యాపన్నగభూషణుండు భక్తియనువలలో భగవంతుండు చిక్కకపోఁడను నార్యోక్తి నిజంబుసేయ నాఁటివలలోఁ దానేని జస్వరూపంబుతోఁ జిక్కువడి ప్రత్యక్షుండై భక్తునిగఁటాక్షించి ప్రమథాధిపత్యంబొసంగి కైలాసంబునకుఁ జేరిచిన నఖండసామ్రాజ్యం బను భవించుచుఁ బ్రమథగణసేవితుండై యునుచున్నాఁడో యట్టియుడి భర్త నయనారిం జేరి బ్రతికెను దశశత భృత్యవర్గమునకు నేను దశశతతరభృత్యుండను.

ఏణాధినాథుని కథ

విభూతిరుద్రాక్షధారులెల్లఁ దనకు శ్రీలింగంబుగా భావించుచు నేలాపురంబున రాజ్యమేలుచు నమితశక్తివంతుండై పరరాజులగెలిచి వారలవలనఁ గప్పంబులంగొనుచు రాజులకెల్లనుముక్కులోని ముల్లయియుండ నాతనిమీఁదికి నొకరాజు తనమంత్రిని బార్వతీశశాసనధురీణుం జేసి మేనెల్లభూతిఁబ్రామి యుద్ధంబునకంప నాతనితోఁదలపడి మొదలిభూతిఁజూచి "నమశ్శివాయ"యని కత్తినేలబడవైచి "శివశరణు శివశర"ణని వాకంబులపై బడిలేచి స్వామీ, దయచేసి పూజలఁగొనుండఁక నాపచివ్వుఁడట్లు కాదు నీవుమాకశతుఁడవు నినుఁదలఁదునుము మని మారాజునన్నంపె"నని కరినాలంబెత్తి నటుకదొఁజకొనునవసరంబున నాఖడ్గంబును పుష్పమాలయై మెడఁజుట్టుకొన హరశాసనసిష్టాగరిష్ఠుఁడగు ఏనకానీశుఁడు నిజరూపంబునం బొడసూఁపి మోక్షమొసఁగి కైలాసంబునకుం గొంచుపోఁగిన యేణాదినాథునకు భృత్యానుభృత్యుఁడను.

### చేదివల్లభుని కథ

వెండియు నఖండశివభక్తిధురీణుండగు చేదివల్లభుండు రుద్రాక్ష భసితమండనుండై రుద్రాంశను భావంబున నట్టివారల మన్నించుచు పరభూపతులను భండనంబునం జోరిగొనుచుండనో దిన తేదులు పదము ప్వ్రాజ బలవంతులగు స్త్రాయుధులు జేసి వారల దేహంబులకు శివచిహ్నంబులగు రుద్రాక్షభస్మంబులలంది పంత వారుంగాంచి మించుభక్తిని శివభావంబున సాష్టాంగదండంబిడి వారందఱుఁ దమనిగూఢాయుధంబుల నాతనిం బొడువ దేహంబునం బొడమెడు రక్తంబున కెంతయుఁ జింతింపక నిశ్చలమానసంబున వారల నిజగురుజంగమరూపులుగా నెంచి మఱిమఱి మ్రొక్కుచుండ ఖండశశిమండనుండు సాక్షాత్కరించి మోక్షంబొసంగి యక్షయపదలింగల కాలము నిలిపినట్టి చేదివల్లభునకు నూడిగంబులు సేయు నసంఖ్యాక దాసగణంబులలోఁ గడపటివాఁడను

### కరయూరిచోడుని కథ

శంభుచిహ్నంబులం దాల్చినవారిని శంభుస్వరూపులుగాఁ గైకొనుచు ఎరథరారమణులపైఁ దనసేనలనంప వారువారల గల్చిపోరులో సీల్గినవారి శిరములు ముప్పదిబాఁడ్లై గొనిరాఁగ నందునొక బుత్తమిఁగుల రక్తసిక్తమై యూసవాలుపట్టి సలవిగాని కీతింగనుపట్ట నట్టిదుర్నిరీక్ష్యంబగు ప్రధానాంగంబునకుఁ దనతలను మొఱఁగు వెట్టెదనని తలఁదఱుగుకొని దానిపై శివార్పితముగా నుంచిన వానిసాహసంబునకు మెచ్చిపచ్చవిల్తువిరోధి నిజరూపమున నచట నావిర్భవించి శాశ్వతపదవికిఁ గొంపోయిన భక్తవర్యుండగు గదయూరిచోడునకు నూడిగంబులు సేయు నధమాధముఁడనగు గొలువుకాఁడను.

### కలియంబినయనారు కథ

తనపనివాండ్రలో నొకఁడు తన్ను కను మొఱఁగి పాఱిపోయి లింగధారియై జంగమభక్తులం గూడి యే తెఱవారలనండటి కర్ఘ్యాద్యుపచా

రంబులు సలుపుతతి వాశలఁగోసివాఁడగు నిజపరిచారకునికి సైతము లింగధారణామాత్రమున శివస్వరూపిఁగా భావించి కాళ్లుగడుగ నీరువ్రో యుదనఁగూలు "వీనిమీఁదెట్టుఁగ రావి పీఁడుమనవేతనపుబనివాఁడు. వీని కాళ్లుఁగడుగవ" ద్దని నీరువ్రోయుటమానినమానినిఁగని శివునకు నర్ఘ్యం బిచ్చుచుండ నీయందజయాన వానిఁబరిహరించుచున్నది ఇట్టియపచారంబు లుసేసిన యాసతి నెట్లుచేకొందునని దానిచేతులుఖండించి సీశ్వరుండు సాక్షాత్కరించి తెగినహస్తములవలికి యతియుబోకంబునకే భక్తవరు నిఁగొంపోయెనో ఆకిలియంబచయునారికి నౌకరులగువారికి నేను నౌకరును.

## ఇకవదాండికథ

ఏమహాభక్తుఁడు జంగమలింగపూజ నిష్ఠతోఁడ నొనరించుచుం డ నాతనిభక్తి నరయుఁగోరి గౌరీపతి జంగమరూపంబున వచ్చి పూజ లు గొని గోచియుబొంతయు నిచ్చియిది భద్రబఱచుకొని యుంచుము. నేనిప్పుడేగంగకుఁబోయివచ్చితీసుకొనియెదనని యొప్పించి గడియతాళి గోచియుబొంతయు మాయనుసేసి తిరుగవచ్చి "యేదీనాగోచిపాత యును నాబొంతయునాకి" మ్మనఁ బెట్టియయుంచుభద్రపఱచిన వానిం దీయఁబోయి యుందుంగానక యిల్లెల్ల వెదకి యెచ్చటంగానక తొల్లింటి గోచిపాతకును బొంతకును వానియెత్తు బంగిరునోసంగెదనని యొడఁబ ఱచి యొకత్రాసు దెప్పించి యదవియుంచి బంగారముఁ దూచనారం భించిన గోచిపాతిబొంతలే బరువెక్కుడగుచుఁ డినపసిడిసొమ్ములు చాల కపడుచుండుటఁగని పెద్దకాలావేయించి యందుఁదూచుచు డనింటను న్న నగలునాణెములు వస్త్రములు సమస్తంబు పెట్టినను సామగ్రివహించి నభాగమెపైకివేచుచుండుట యాకాలూపైఁ దానెక్కఁబోవ నద్దు నని నిజరూపంబు సూపి యీయఁబడిన మోక్షంబుఁ గొల్లగొనెనో య ట్టియిదువదాండికి నడిదొందాసుండను.

డమున నెన్నఁడు నలింగధారులు లేరు నేనెట్టులలింగసంగత దేహుండఁ
గాఁగలను? నాకదిరుచింపకున్న" దిన "నీకువలసినంత ధనమిత్తునట్లుసేయు
ము" అనుటయు "అదినాకక్కఱలేదన" నీకువలసినంత ధనమిత్తునట్లుసే
యుము" అనుటయు "అదినాకక్కఱలేదన "నీతలఁదునిమెద"నని కత్తి
దూసితెగవైచునవసరమునఁ గత్తివేటు మెడపైఁబడియుఁబడని యొసె
సుమృదుండు నిజరూపంబునఁ బొడసూపి "యోయీ! నీకుఁగావలసిన
వరంబులవేఁడుమిచ్చెద" నన దేవా! నీవరంబులు నేనొల్ల తొల్లియే
నెలమకాపురూపమున నేతెంచితివ్రా యారూపంబునను లింగంబు మెడ
గట్టుకొనివచ్చినఁగాని నీమోము నేఁజూడ"నని తక్షణము శివకాపును
లింగధారిగా నొనరించిన గణపాలునకు నధమభృత్యుఁడను

## కుమ్మరిగుండయ్యకథ.

మఱియుఁ బెనుబెట్టయనుపురంబునఁ గుమ్మరిగుండయ్య యను
భక్తుఁడొకఁడు గలఁడు. అతండు సంతతశివదీక్షామతియు జంగమార్చ
నాలాలసుండునై యొకనాఁడు శివాలయంబునకేఁగి యందునీశ్వరుని సే
వించి తిరిగియింటికిఁబోవు నవసరంబున నొకవేశ్యయన్నముదిని కంచము
వొలిచి గిరగిరఁద్రిప్పి యానీరు తానురుగుమీఁదనిల్చి పైకిఁబాఱఁజిమ్ము
టయు నాయెంగిలినీరు తనపైఁబడకుండ చేసికొనుటకుఁ జీఁకటిరాత్రిల
గుటచేఁ దప్పించుకోలేక "శివశివ" యని భగవన్నామస్మరణ మొనర్చు
చుఁ బోవుచున్నయాతని గుండయ్యఁగా నెఱిఁగి లోనికింగొంపోయె సు
గంధనూనెలఁదలయంటి పన్నీటజలకమార్చి కర్పూరతాంబూలంబు విడె
మొసఁగి యుపచారములు సెప్పుకొని పంపుటయు నాతండింటికిజని
భార్యతద్వర్తనం బెఱుంగనిదైనను దనవంటి గంధంబువలన నాతనికి
వేశ్యాలంపటము గలిగెనని యోచించి తన్నుస్పర్శింపవద్దన నామెతో
సరసోక్తులాడుచు వేశ్యచేసినతప్పును దానికై యదిసేసిన యభ్యంగన
మును నాయకు నివేదించి కొంగుబట్టఁబోవ "నన్నా ముట్టవద్దు నీకును

నాకునింతటితోసరి" యని ముట్టనీయకుండుటయు శివుండు జంగమవే
షంబున నాతనియిల్సేరి పూజకుఁగైకొని తనచేతికమండలు నాతనిచే
తికిచ్చి "యిది భద్రపఱచి యుంచుము నేను మఱలివచ్చి పుచ్చుకొని
యెద" నని చెప్పిపోయి యాకొప్పెరమాయఁజేసి మరికొంతసేపటికి
వచ్చి నాపాత్రి నాకిమ్మనియడుగ గుండయ్య, దానిదాచిపెట్టిన పెట్టియ
దీసిచూడ నదికనఁబడలేదు భార్యనడుగ నామెయు నేనెఱుఁగననియె.
అంత నామాయజంగము "మీభార్యాభర్త లిరువురు నేకమయి నాకొ
ప్పెర నపహరించి యేమియునెఱుంగనివారివలె నటించుచున్నారా? ఇదే
నాకమండలువు నీటిపాను నాకొప్పింపరేని మిమ్ములను తగవునకు రచ్చ
కీడ్చెద. కాదేని, మీ రుభయులు చెరువులోమునిఁగి స్నానముసేసి భా
ర్యశిరంబుపై భర్తయు భర్తభుజంబుపై భార్యయుఁ జేతులుంచి యా
కొప్పెర మీరుదాచలేదనియు నెటులమాయమైనదో మీరు నిజముగా
నెఱుంగననియుఁ బ్రమాణముసేసితిరేని నమ్మెదననుటయు నావధూవ
రులు "స్వామీ! వేఱొండుప్రమాణము సేతుముగాని కొండొరుల
శరీరంబులు దాకను నేఁటికెనిమిదిపదులు సంవత్సరములనుంచి మేము
భార్యాభర్తలమయ్యు నొకరినొకరుఁ దాకక పరస్పర సంభాషణములే
గాని స్పర్శలేకయే కాపురముసేయుచుంటి" మనమాయజంగము "కాదు
వప్రమాణంబులు నాకుఁబనిలేదు. మీకిష్టమున్నదేని నేఁగోరినశపథం
బుఁ జేయుఁడు లేనియెడల రాజదండనంబున కొడంబడుఁడు" అని
యీమొదలగు ననేకమాటలుచెప్ప వారలశపథంబున కొడంబడి వడు
గున బుడకలిమువఁ జేసి యొండొరులు శుద్ధజలంబులవార్చి "స్వామీ!
మేము నిర్దోషులము మమ్ము నీజంగమదేవర నమ్మునటుకు నీవెసాక్షివి.
దక్షయజ్ఞవినాశనా! పాపనాశనా! సాంబసదాశివా!" యని యొకరిశిరం
బుపై నొకరుహస్తంబుపై నొకరియరచేయియుంచి పరస్పర స్పర్శ
నంబులు శేసికొనుటయు నాకపటజంగమదేవర తత్క్షణమే యదృశ్యుండై

నిజశివస్వరూపంబున దాక్షాయణీదేవీ సమావృత వామభాగంబుతోడను గంగాతరంగిణీ సమలంకృత జటాజూటంబుతోడను, వండశశాంకభూషణంబులతోడను, నీలనేత్రంబుతోడను, వృషభారూఢుండై, ప్రమథరుద్రగణంబులతో వాగీశలక్ష్మీశాదులతోడను సాక్షాత్కరించి గుండయ్యా! యెనుబదిసంవత్సరము లేకనిష్ఠగా జరిపిన మీదంపతుల బ్రహ్మచర్యవ్రతంబునకు నేఁ దనిపితిని మీరిద్దఱు సరిముదుసలులైతిరి మీరిపుడ నేఁ దరుణరూపవనంబు మఱలఁ బ్రసాదించితిని. మీరు త్రిదశవయస్కులరై త్రిదశుల బోలి యీలోకంబున మఱియెనుబదియబ్దంబులు యిష్టసుఖగోష్టి బరస్పర సరససల్లాపసంభోగాద్యాచరణంబులఁ బరమసుఖంబనుభవించి యాపైని మీకెప్పుడు నాలోకంబునకు రానలెనను కోరికగలుగునప్పుడు నన్ను స్మరింపుఁడు మీకువిమానంబు నంపెదను దానిపై గూర్చుండి వచ్చినా ప్రమథగణంబులతోఁ గలసిమెలసి వారలకధీశులై యుండుఁడని యనుగ్రహించి యదృశ్యుండయ్యె నట్లు గుండయ్యకు భృత్యాచారముండెను.

## పుసలనయనారి కథ

విక్రమచోడుండు బంగారులింగంబును బానువట్టంబును జేయించి శివాలయమునఁ బ్రతిష్ఠించుట గాంచి తానునిజదేహాలయంబున నాత్మలింగంబును బ్రతిష్ఠించి మనఃపూజలుగావించి యీశ్వరప్రసాదంబు నొందిన పుసలనయనారికి దాసానుదాసుండను

మఱియు రాజ్యమునొల్లక జడలుదాల్చి పరమయోగియై మోక్షమొందిన తిరువాలునిబంటును తిరునావకరుశుని నారాధించి యాతనికరుణచే నీశ్వరుని యథాస్వరూపంబెఱిగి సేవించిన తిరుకురుపికి బంటుబంటను గోహిణీయు దాసునకునాయాసంబునఁ బురహరప్రసాదంబు వడసిన తిరుప్పూరితిరుమూలదేవునికి భృత్యుఁడను సంతతభక్తపరాధీనమానసుండై వారలసేవయె ప్రధానవృత్తిగాఁ గలిగి మెలఁగిన చిరు

పులిదాసునకు దాసానుదాసుండను దీనముఖంబునఁ దనకొకసమయం బుని శివుఁడు లింగరూపంబునఁ గనఁబడిన నఱిమెతింగి యాలింగమూర్తినిఁ జేతనిడుకొని యోదార్చుమాటలాడిన చిరుతనయనారికిం బాదసేవకులలో నధమగణ్యుఁడను ఇప్పటికిఁ గనుపించిన భక్తులవశపార్శ్వపు భక్తులిండ్లఁ బనులుసేయు వారికింబరిసేయు నౌకరు నేన వర్తమానభక్తులకుఁ గైకర్యంబులు సేయు గింకరులకుఁ గింకరుండ ఇంకముందు శివభక్తులై పుట్టఁగలుఁగు భాగ్యంబుగలవారియింట నొంటరిబంటనై యుండఁగలవాఁడను ఈతీరున ననేకప్రకారముల భక్తులచరితంబులు పాడుచు నడుగడుగునఁ బడిబడిదండంబులిడుచు సాష్టాంగంబుగాఁ బొర్లుదండంబులుపెట్టుచు మఱియు దీనస్వరంబున ‹‹మీభక్తుఁడ, రిక్తుఁడ, మీదాసానుదాసుండ, మీసేవకాధముండ, మీయడిమెడదాసుండను, నాన్యథాశరణుండ, మీరేనాపక్ష నన్నుఁగావరే, దీనదయాపరులారా శివభక్తసమూహములారా, యనియఱచుచుఁ దనవెంబడిం బంచశతవదనుండు పొంచిపొంచియరుదేర భక్తవరులాతనింగాంచి వెంటవచ్చు నీలకంఠుం బరికించి నమస్కృతులొనరించి యాతనిం గాంచి తమలోఁ జేర్చుకొని వారలతో సర్వేశుండు మీరుమండని భక్తికిమెచ్చి సాహసంబునఁ దన్నావేశపెట్టినందుకు మునుమున్ను యదఱఁగైలాసంబునకుఁ గొనిపోయెను కనుక బసవదండాధీశా! భక్తులకుగర్వము తప్పౌనోకాదో నీవే సెప్పుమని పూర్వభక్తుల చిత్రచరిత్రకథ నమిషంబున బసవేశ్వరులకు గొన్నినీతు లుపదేశించి యాతనికిఁగలిఁగిన గర్వంబు బెడఁబాపి, వచ్చిన భక్తులకు మణిదుమధనరాను లొనంగి వీడుకొల్పిన బసవన్న పాదాక్రాంతుండై వీడ్కొని భక్తజనసమేతంబుగా నిజగృహంబునకేఁగి సుఖంబుండె.

బిజ్జలరాజును పురజనులు నాతండు కేవలము మంచుమలయల్లుండుగాని సామాన్యమనుజుఁడు గాఁడని శిరంబులువంచి హస్తంబుఁ

మోప్చి దండంబులవెట్టి తమతమ నికేతనములకరిగిరి. మాచయ్య తన భక్తిమార్గంబునకుఁ దానేఁగెను. ఈమడివాలుమాచయ్యకథ భక్తితో జదివెడువారును విన్నవారు నొరుకుఁ జెప్పువారును మాచయ్యవంటి ప్రభావముగల భక్తులై ధరలో ననేకవిధములగు సుఖంబు లనుభవించి యంతంబునఁ గైలాసంబుం జూఱఁగొందురు.





# బసవపురాణము.

## పంచమాశ్వాసము

---

### కిన్నరబ్రహ్మయ్యకథ

పుడమిపడఁతికి మొలసరపుదండలోని కొలికిపూసవలె నందగించెడి పోఁడిమిని నొకపురవరమున కిన్నరబ్రహ్మయ్య యను నామంబునఁ బరఁగుచుండెడు భక్తుఁడొకఁడుగలఁడు. అతఁడు ప్రౌఢశైవుఁడు. భూతదయగలవాఁడు లౌకికవృత్తులనేకములు నేర్చినవాఁడు లోకపూజ్యుఁడు లోకవంద్యుఁడు. అఘటనఘటనాపటిష్ఠుఁడు భక్తపరతంత్రుఁడు లింగసంగతదేహుఁడు శివభక్తాగ్రేసరుఁడు బహువిధవృత్తులఁ దానార్జించిన ధనమంతయు భక్తాయత్తంబుసేయుచుండును ఇట్టిభక్తపరిత్యాగము కొఱకుధనము సంపాదించ నతండొకనాఁడు కిన్నరమీఁటుచు రాగంబు పాడుచుండఁ గిన్నరనారదాదిగాయకులు టక్కేఁగి యాసంగీతమాధుర్యమున నోలలాడుచుండఁ దుంబురుండెందుమాలియు నాతనిగీతగానంబునకలరి బ్రహ్మయ్య నాదబ్రహ్మములయుబ్రహ్మము రాగబ్రహ్మము దానయై యొప్పునని యప్పరమేశ్వరుండు దినదినమూతనికి నొకమాడయు నొకచిన్నంబు నొకపాతికయు నిచ్చుచుండును ఈశ్వరునివలనఁ గొనుధనమునుసైతము భక్తులకే వినియోగపరచుచు నిత్యము జంగమపూజయొకవిధికృత్యముగా నిర్ణయించుకొని యాతండు కాలంబు గడపుచుండ బసవేశ్వరుల భక్తివాసనలు సర్వదిగంతరాళముల వ్యాపించి మించుచుండుట గాంచి బసవనాయకుని దర్శనము సేయవలెనను కుతూహలంబున బిజ్జలరాజు నేలుబడిఁ బ్రధాననగరంబగు కళ్యాణపురంబునకరిగె. అట్లతని రాక

యంతకుముందె బసవేశ్వరులు తమలింగమూర్తియందు నిత్యశివార్చ
నావిధానమునఁగనుఁగొని తాఁగనినయట్ల తన్నుంగానవచ్చిన కిన్నర
బ్రహ్మయ్యకుఁ గతిపయపదంబులెదురేఁగి సాష్టాంగవందనంబాచరించి
యర్ఘ్యపాద్యాదివిధులఁ బూజించి యాతనిపాదోదకంబు శిరస్సునఁజల్లు
కొని బిల్వప్రసాదం బందుకొని కర్ణోపరిభాగంబున ధరియించి గృహం
బునకుఁ దోతెచ్చి షడ్రసోపేతభోజనంబునఁ దృప్తునిం జేసి తత్వచింతలు
సేయుచు నిద్దఱుండిరి. ఇట్లిద్దఱుఁ దద్దయుఁ బెద్దతెకంబున సన్నగ
రింబున నెకొనియున్న త్రిపురాంతకేశ్వరు నాలయంబునకరిగి, యం
దుఁ గిన్నెర బ్రహ్మయ్యమాత్రము గొంతతడవు మృడభక్తజనగోష్ఠి
నుండఁగోరి బసవేశ్వరుల వీడుకొలిపి గోపురద్వారంబున భక్తగోష్ఠిని
బ్రహ్మయ యుండునవసరమున నొకవిటుఁడు పండుగనెపంబునఁ దనవే
శ్యకు సమర్పింప నొక కండక్రొవ్వుగల పెద్ద గొఱ్ఱెపోతును వెలకుఁగొని
దానిమెడనొక త్రాడుగట్టి వీధిఁగొనిపోవుచుండ నాలయసమీపప్రాం
తమున వచ్చునంతలో నామెండమెకము మిండఁడుగట్టినత్రాడుఁ దెగి
యది తప్పించుకొని యాలయంబులోని కరిగి గర్భకోవెలమఱుఁగున
డాఁగియుండెను దాని బట్టి నావిటుఁడును, తోఁడెదననుచు గుడిలోని
కరుగఁ గిన్నెరబ్రహ్మయ్య వాని గని మృదువచనముల నిట్లనియె —
“నాయనా! ఇఁకలోనికిరాక యిచట నేనిలువుము నీబారిఁబడిన యీ
పోతులు దైవవశంబునఁదప్పి యీ మహేశ్వరునాలయంబుఁ బ్రాణభ
యంబున మాశరణుసొచ్చెను. గాన దీనిఁ జంపుట నీకున్యాయముగాదు.
ఎంతమూర్ఖుఁడైనను శరణన్నవానిఁగాచును గాని విడువఁడు అట్టిస్థితి
లో పశుపతిభక్తులు తమ్ముశరణంబునొందిన పశువిశసనంబునకొర్తురే?
నేనీఁ జంపనీయను నీకువలయునేని- గొద్దియో గొప్పయో నీగొఱ్ఱెవి
లువ మాచేఁగొనిపొమ్ము ఇదియ మానిశ్చయ”మని పెనఁగొనని
నెను అంతవాఁడు పకపకనవ్వి “కొవ్విన గొఱియపోతును పండుగ

వేఁటకై రొక్కమిచ్చి గొని తెచ్చి దానిం బోవిడుతునే? గుడిఁ జొచ్చినను,
మడిఁ జొచ్చినను విడుచువాఁడనుగాను నాగొఱ్ఱెను నాకిమ్మని జాగు
సేసిన నాబోగిని కోపించునను భయమున నెంతవ్రేలినను దానిని
బ్రహ్మయ్య విడువకుండెను. అంత నావిటుఁడు డవచనంబున నిట్లని విత
ర్కించె — "ఈదాసుఁడు దీనివిడువఁడు వృథావిళంబము నాకేల? దీని
కితఁడిచ్చిన వెలఁబెట్టి మఱియొక మంచిక్రొవ్విన గొఱ్ఱియనుఁ గొనిపోయి
యాతెరవకొప్పించి దాని ప్రసాదంబువడిసెద నీతనివలన మిగులధనంబు
గొనియెద" నని మిగులకోపంబునఁ బోవువానివలెఁ బోవనుంకించు వా
నింబిలిచి తట్టి వేయుమాడలు దెప్పించి యిప్పించి యాచొప్పునఁ బంపివేసె
ను. వాఁడును మఱియొక మంచిగొఱ్ఱెనుగొని సానియింటికిం గొంపోయి
"నాయికామణీ! యిదెగో సూఁడుము నీనిమిత్తమొంతమంచి పొట్టేలునుఁ
దెచ్చితినో దీనివేఁటగాఁ గైకొని పండుగఁ గావించి దానిమాంసంబున సు
ఖభోజనము సేసి యాపైన నాకు నీభోగభోజనము వెట్టించుము" అని
మంచిమాటలాడుచున్న వానికి నామె" ఓరీ, నీగుండెతనము సాలును
నలుగురిలో నగుబాటు నీకును నాకును జేకూరెను. తొలుతఁ గొన్న
వన్నెగల బలిసిన వెలగల వేఁటనమ్ముకొని యల్పక్రయమునకు విధిలేక
కొన్నదీనిం దెచ్చి నా మొగంబునఁ బాఱవైచితివా? నీతోఁటివిటులు నీ
యోలమిఁ గని నవ్వుచున్నారు. నాతోఁటి వెలబోఁటులు నన్నుఁ గని నీవం
టిమగవాని నింటఁ జేపట్టినందుకు నవ్వుచున్నారు గనుక నీచేతనైనఁ
దొలుతటితగఱునె గొనిరమ్ము కాదేని నాతో రావనెపొమ్ము మఱిరా
వద్దు నేటితో నీకును నాకును సరి. మఱిపొత్తు లేదు పొమ్మని
మెడబట్టి గెంటెను. వెలయాలిపొత్తు కలకాలముండునని నమ్మినవాఁడు
మూఢుఁడుగాని యింగితజ్ఞుఁడుగాఁడు బుద్ధ్యుపాయఁబగు పాయంబు
నాపాయంబని కాయంబుసతమని మదవతులవలపులలోఁ బడిన మిలమిల
లాడెడి గండుమీనంబులుగారె. రోయింతుల పంతంబులు నెఱవేర్చువా

రుఁడట్లు యీచొప్పఁడు తననాశంబునకే మఱి యాగుడికిఁబోయి గో
త్రంబట్టఁబోవ బ్రాహ్మణుఁగని "యోరీ! దానిఁబట్టకుము అది గోత్రపో
తుగాదు వెలకూడలు సెల్లినపుడే యదివృషభంబై యంబాపతివాహ
నంబైనది ముట్టకుముట్టకు" మని యడ్డువడనాబాఁపుడు వాలువెతికి
బ్రాహ్మణుని నఱుకనుఱుకు సమయంబున నాయనయుఁ దనచేతికరవా
లమున వానితలదునిమె నదియు నీశ్వరునిగుడి వెనుకప్రక్కఁ బడియె
అప్పుడచట నున్న యాబాపుని చుట్టములు మిగులదుఃఖంచి రాజుపాలికిం
బోయి "దేవా! యిదేమివింత మనపురంబున శివభక్తులు పెచ్చుమీ
ఱితేమయిచ్చవచ్చినట్టుల పురజనంబుల నాశంబు నొందించుచున్నవారు.
వారల బారిఁబడి మేము బ్రతుకంజాలము వారలనె పురిలోనుండనిచ్చు
మమ్మెటకన్నఁ బొమ్మన్నఁ బోదు" మని మొఱవెట్టుకొనిరి. బిజ్జలరాజు
మిగులఁగోపించి బసవేశ్వరుల పాలికరిగి "బసవమంత్రీ! మీహరభక్తుల
చరితంబులు విన మాకు వెక్కసంబగుచున్నది. వారు హింసాదూరులని
దయాపరులని సన్మార్గసంచారులని విందు నేఁడది చోద్యంబయ్యె
మనశివాలయమున నొకభక్తుఁడు గోత్రపోతునకై పోయి యొకనితలను
నిమెనఁట సంసారులప్రసంగంబు తనకేల? ఇట్టి యాగడములు మీకే
దగును. తొల్లింటి భక్తులమార్గములు నిట్లెయున్నవి. ఒకఁడు బాలునిఁ
జంపె. మఱియొకఁడు శివలింగమును గాలఁదన్నెను. ఇంకొకఁడు తండ్రి
నిఁ జంపెను వేఱొకఁడు మాంసపుకండలు తినఁబెట్టెను వెండియునొ
కండు తనయాలినిచ్చెను ఇట్లెందఱో క్రూరకృత్యంబులు సలిపి యవి
యెల్ల భక్తికృత్యంబులందురు. ఇతరుల ధర్మంబు లధర్మంబులందురు.
మీయధర్మముల ధర్మంబులందురు. మీభక్తిమర్మంబులు మీకే తెలు
సును ఇట్టిమారున్నచోట మాపంటి రాజులు ప్రజాపరిపాలనంబు సేయ
వెఱతురు కాన నికమీఁద మీరే రాజ్యమేలుఁడు. మేమెటకేనింబోదు"
మనెను. బసవేశ్వరుల వారదివిని "రాజా! దేవరవార ట్లనఁదగునా?

శివభక్తులన్న నంతమొరకులా? వారివంటి భూతదయాపరులు మఱిలేరు
ఏవినవారు ముందు వెనుకల నారయక భక్తుల నిట్లు తూలనాడఁదగునా?
ఎవ్వరెది సెప్పినను వినవచ్చును గాని విన్నంతమాత్రమున నమ్మఁ గూడదు
అట్లు నమ్మి యాప్రకారము నడుచుపుడమితేఁ డిర్దినననఁగొట్టంబునం
గట్టుమన్నవానిపాటవాఁడు. శివభక్తునకును బోపునికిని గాఱియువిష
యంబునఁ బ్రవర్తివిసకలహ కారణమును విచారించి ముందెవరియందు
దోషమున్నదో వారలశిక్షింపవలెను. మంత్రులవనంపి యాకారణమా
రసిరమ్మని యానతిందు తొలితప్పుసేసిన గుండగేఁడును దండితము.
ఇంతకు నట్టివాఁడె తనతప్పునకుఁ దగినదండమును దానె బొందియుం
డెను ఇఁక మనము శిక్షింపనవసరమేలే" దనవుడు బిజ్జలేశ్వరుఁడు
"మంచిది. కానిమ్ము ఇప్పుడె మంత్రులమూలమున సర్వంబునిర్వహిం
చెద" నని యమాత్యులనల్వుర రావించి యాలయంబునకేగి వేఁగుల
వారిచందంబునఁ దొల్త గొంతవిచారించి పిమ్మట శివభక్తునిజోటియు
కరారు గొనిరండని పంపెను వారునుశివాలయమునకేఁగి యచటిజనం
బుఁను రహస్యప్రకారంబునఁ గిన్నెర బ్రహ్మయ భక్తివికారంబుగొం
త యరసి యామీఁద నాతనియొద్దకుంబోయి నమస్కరించి "భక్తవ
రా! ఏమియీవింత. భూలోకమున శివభక్తుల హింసాపరులనియెడి కీర్తి
బొందియున్నచో నేఁడు మీరుమాబొప్పనిఁ బోటులునకుఁగాను సంపితి
రని యపవాదవ లగుచున్నారు దీని నిజానిజములు మీనోటనె వినిర
మ్మని యిమ్మహీపాలుఁడు మమ్మంపె. సీఘ్రంబ సెలవిండు. పోయివ
చ్చెద" మని విన్నవించిరి బ్రహ్మయ్యభక్తుఁడును "శివశివా" యని
చెవులుమూసికొని కన్నులరమోడ్చి భగవధ్యానంబుఁగీలించి "రాజమం
త్రులారా! వినుండు. నేనీయాలయంబున హరకైంకర్యము సేసికొనుచు
న్నకాలమున నీబొప్పవిటుఁడు దనలంజకుఁగాను పండుగవేటకై యొకమం
చిబలిసిన మెండపోతునుగొని మెడకుఁద్రాడుగట్టి యీడ్చుకొనిపోవు

చుండ గాలవశంబునఁ ద్రాడు తెగి యాఁగొఱియతల నఱుకఁబడు నపా యంబుఁ దప్పించుకొని యుపాయంబునఁ గపాలపాణి యాలయంబుసొచ్చినఁదద్భక్తులు తన్నుఁగాఁతురని యెఱిఁగినదానివలె గుడిసొచ్చి వెనుకపక్కను డాఁగియుండెను. ఇటుఁడును దానింబట్ట మిట్టిపడుచు గట్టి పట్టుదలతోఁ బట్టఁబోవుచుండ నేగిన "యోయయ్యా! యిది దేవాలయము. భగవద్భక్తులున్నచోటు భక్తులు భూతదయాపరులు పిపీలికాది బ్రహ్మపర్యంతముఁ బ్రతిజీవికిఁ దనజీవమందాశ సమానము నిన్నెనఁడేని నఱుకఁబోవునపుడు నీవుదప్పించుకొని పాఱిపోవుటకుఁ బ్రయత్నింపవా? అట్లనే నీతగఱును నీవుదన్నుఁజంపుటకుఁ గొనిపోవుచుంటి వని యెఱిఁగినదిర్వాలెనిటవచ్చి మాశరణుసొచ్చినది. మేముదీని విఱువము వలసినంతధనమిచ్చెదముకొనిపొ"మ్మంటిమి వాఁడును మాపట్టుదలసూచి ఇక వీరె తసొమ్మయిన నిచ్చితీరుదురుగాని గొఱ్ఱెను విఱువరని నిశ్చయించుకొ నిమాచే వేయిమాటలుగాని వినిపించుకొనెను మఱికొంత సేపటికి వాఁడలి వచ్చిమాతోఁ బ్రసంగింపకయె గొఱ్ఱెంబట్టి ఁబరుగత్తి పట్టునప్పటికి మేము గని యిదియేమిరా, యప్పా, నీయాగడము "ముండయుమాటయు దక్కె" నన్నలోకోక్తి వింటివా, ధనమునుగొఱ్ఱెనుగూడ దక్కించుకొనియెదవా? ఇఁకనీవు ధనమువాఁడవుగాని పొటేలువాఁడవుగావు మేముదీని వెల నీకొసగినతక్షణమె దీనిని లింగసంగతంబు గావించితిమి చూడుము దానిమొదలనున్న శివచిహ్నంబులు వానింగనియు నీవుఁబట్టభయము లేక చేతులెట్లాడినవి అదియుఁకమీఁద నీశ్వరునివృషభవాహనంబుగాని నిజముగాఁగొఱియగాదు కనుక నీకుజీవమందాశయున్న దానివిడిచి పొమ్మంటిమి వాఁడునిప్పుడ్రొక్కినకోఁతివలె మండిపడుచు నోఱులోని కత్తిబైటికిఁదీసి నన్నేయఁబోవుటయుఁ బ్రతిజీవునకు నాత్మరక్షణంబు ప్రధానకర్తవ్యంబుగావున నేనునునాకత్తినెత్తి యొక్కవేటున శిరఃకళేబరంబుల వేఱుసేసి నాతనువునేను గాపాడుకొంటిని ఆశిరంబును దేవా

లయమునకుఁ బృష్ఠభాగమునఁ జేయుచున్నది మీరు పోయిగనివచ్చి తొలితప్పెవరిదో తెలిసికొని మీయినునకెఱింగింపుఁడు. వానికి నాకును వేఱునాత్ములు లేరు. మీరునమ్మకేని నానిజంబు మీకుఁబ్రత్యక్షగోచరంబుగుటకుఁగాను త్రిపురాంతకుచేత నె పలికించెద'నని పలుకులుసెప్పెను. అమాత్యులు జరిగినప్రసంగము మహిపతికెఱిఁగింప భూజానియను నాశ్చర్యంబునొంది "యేమీ! తాఁజేసినపని జేయుటయేగాక దేవునిచే బలికించి తనమాటనిలుపుకొనునా? కానిమ్మదియుఁజూతము. రమ్మని మంత్రివర్గంబు తోడను బురజనంబుతోడను జనినిలుచున్నతఱి వారలతో నేఁగిన బసవేశ్వరులు కిన్నరబ్రహ్మయ్యకు నమస్కరించి చేతులుజోడించి యిట్లని స్తుతించెను శృంగారులకెల్ల శృంగారకుఁడును విరాగులకువిరాగిగను భక్తులకుభక్తుఁడుగను, దేవతలకుదేవుఁడుగను స్వత్వులకుసత్విగాను రాజసులకురజోవంతుఁడుగాను తామసులకు తమఃప్రధానుఁడుగను దీనులకుదీనుఁడుగాను ధనికులకుధనిగను బేదలకుఁ బేదవాఁడుగను నల్పులకల్పుఁడుగా మహాత్ములకుఁ మహాత్ముఁడుగా సజ్జనులకు సజ్జనుఁడుగా దుర్జనులకు దుర్జనుఁడుగా దొంగకుదొంగగాను సంసారికిసాంసారిగా నగుపడుచుఁ బ్రత్యక్షదైవంబలైయున్న యోకిన్నరబ్రహ్మయా! భూలోకహరా నీకునమస్కారము

తొల్లియొకభక్తుఁడు శివరాత్రినాఁడు పరాకున విటియింటికిఁబోయి లింగోద్భవకాలమున దాని కుచపీడనంబునకుఁ దలఁకొనుదనచేతుల నందొకదానినంటి యప్పటికి శివరాత్రి స్ఫురణకురాఁగా 'హరాహరా' యని యాడుగఱచుకొని మనంబు శివపరంబుగాఁగా నామెకుచంబునె లింగముగాభావించి హరహరమహాదేవశంభో' యనికేకవైవ 'నో'యని యొకనాదము ప్రతిధ్వనిఁ బలికింపలేదా? చీమయందు భగవంతుఁడున్నాఁడా? దినమునకెన్ని మనకాలిక్రిందఁబడి మడియుచున్నవని సోదాచూచుట కొకచీమనుబట్టి పిడికిటమూసి "యోశంకర! పాపభయంకర!

భక్తసుఖంకర!” యని యొకపిలుపుబిలువ “నోయి” యని వానిచెవి యొద్ద నుంచఁబడిన పిడికిఁటిలోని చీమనుండి ప్రతిధ్వనివినఁబడలేదా? మఱియు బాపూరి బ్రహ్మయ్యభక్తుఁడు జొన్నలరాశియందుభగవంతుఁ డున్నాఁడని చెప్పి యారాశియొద్దకుఁబోయి “పార్వతీమనోహరా, పరాత్మా, పరమేశ్వరా” యని యాహ్వానంబొనరింప “నో” యని దాని నుండి భగవంతుండు ప్రతిధ్వనియియ్యలేదా? అట్టిభక్తులకన్న నీవేలయ లఁతివాఁడవగుదువు రాజును మంత్రులును బంట్లును పురజనులు నాబాలగోపాలము జూడవచ్చిరి గనుక యీశ్వరునిఁబలికించి కీర్తిచే నందలము చుమనివేఁడికొనెను. అప్పుడా యీశ్వరునికంఠధ్వని వినుటకు నందఱును విన నక్కడక్కడదాఁగియుండ నాగుడిపూజారియు మెల్లనఁగుంచెకోల దిప్పి తాఁజనియొకమూల నొదిగియుండెను బ్రహ్మయ్య యప్పుడు కన్నులరమోడ్చి యాలయంబు తల్పులుదట్టి శివాశివాశివా’ యని మూఁడుతట్టులు తట్టునంతలో దడాలున తలుపులువీడి వెనుకకుఁ దెరువఁబడి ద్వారంబు వెల్లడియయ్యెను అప్పుడు పురజనులు తొల్లి భక్తులకుభగవంతుఁడు తలుపులు దెఱచెనని వింటిమిగాని యిపుడుకన్నులార గంటిమి ఇఁకనితఁడు దేవునిమాట్లాడింపఁగలఁడని కిలకిలమనుసంకులధ్వనులతోఁ జూచుచుండ బ్రహ్మయ్య “యోయయ్యా! త్రిపురాంతకేశ్వరా నాపనులువేఁడులేదు నిన్నేఁ నేఁగోరుకొంటిని నాచెప్పినది నిజమో యబద్ధమో నీవేచెప్పవలె నీయొక్క గంభీరకంఠనాదంబు విని నందఱు వేడుకపడుచున్నారు. కాన నైజంబుదెలుపుమో దేవా” యని బిగ్గఱగా నఱమఁడు గుడిలోనుండి “నీవుచెప్పినదంతయు నావంతయైన నబద్ధము లేక పూర్తిగానిజమోయీ” యను నాదంబువినఁబడి యాధ్వనియాతీరున నేఁడుదినంబులవఱకు నాగక యంతకంతకు హెచ్చుచుండెను ఇట్లేడహోరాత్రము వెసఁగినయానాదంబు ప్రళయకాల గర్జనమువలెఁ దరతరము వృద్ధినొందుచుండ భూతప్రపంచంబంతయు సకలప్రళయం

బున కేమిహేతువోయని కల్లోలితమానసులై పరుగువిడ మొదలుపెట్టిరి
వేధసంక్షోభంబునొందెను విష్ణుండు వెఱచిచనఁబోయెను దేవతలుభీతి
చేత బ్రహ్మవిష్ణుల నాప్రళయంబుమాన్పుమని ప్రార్థింపనరిగిరి. ఆకా
శము దిరుగఁబడెను చుక్కలుమొక్కలువోయెను సూర్యచంద్రాదు
లు గతులుదప్పిరి. భూమి యుబ్బద్దలై పాతాళంబునకు మార్గమిచ్చెను.
అందున్న బలియుఁదాతయగు ప్రహ్లాదునిఁ దోడుకొని కైలాసంబునకేఁ
గి యటనీవార్తవిని భూలోకంబునకుఁ జూడవచ్చెను భూకంపంబుగలిగె
ఇట్టి యుత్పాతంబులు పుట్టినంగని బిజ్జలుండు బసవేశ్వరులంజేరి యీ
యమోఘగర్జానాదంబు మాయింపుమని ప్రార్థింప నాతండు బ్రహ్మ
య్యయొద్దకుంబోయి సాష్టాంగదండంబు పెట్టి తొంటియట్ల మఱల స్తుతిం
చె నట్లన భక్తియనువలలో భక్తుఁడుచిక్కెను. చేఁపలవానికి చిక్కిన
చేప తప్పించుకొను నుపాయంబులేక తుదకుఁ దనజీవంబులె వానికిసమ
ర్పించుచున్నది భగవంతుఁడన్ననో మాయాసహాయుఁడుగాన భక్తుననే
క మాయోపాయంబులచే శ్రమపెట్టఁదలంచి వానినన్నిఁటినిదాటి యొక
వానికిని భక్తుఁడు లొంగకపోవుటచేఁ దుదకు సర్వశక్తిసామర్థ్య
ము లాభక్తులకిచ్చి తాఁదప్పించుకొని పాఱిపోయి దాగియుండును కను
క భగవంతునివలన బొందఁబడిన యఘటనఘట నాసామర్థ్యంబున నీభ
యంకరధ్వని నణఁగింపుమాస్వామీ, భక్తశిరోమణీ, మీయడియేన్
దాసుండ” ననుటయు నాబ్రహ్మయ్య భక్తుఁడును నర్పునియొద్దకుఁబో
యి “హా” యని యొక్కమాఱను నంతకు నిశ్శబ్దముగా నాఘోష
మెటుపోయెనో తెలియక లోకంబులు సుఖస్థితిని దనరినవి. అప్పుడు బి
జ్జలధరానాథుండును తనదండనాథులతో పురజనులతో బ్రహ్మయ్యకు
సాగిలిదండంబువెట్టి “పరమభక్తుఁడా! నీవిట్టివాఁడవని యెఱుంగక నీలో
తరయగమకించిన నాతప్పుమన్నింపుము నీమహాత్మ్యముగనుగొన నేనెవ్వ
డను నీభక్తికిమెచ్చి బ్రహ్మాదులెవ్వని నిజభావంబు గనుగొనలేకపోయిరో

యట్టిగట్టువిల్తుఁడె నీకుబంటయి నీయిష్టానుసారము మసలుచున్నాఁడు నీవుపలుకుమన. బలికి మానునున మాని నీవాడించినట్టుల బొమ్మలాట వాఁచేతి బొమ్మవలె నాడుచున్నాఁడు ఇఁక నీశరణుసొచ్చితిని నన్నుఁ బాలముంచు నీటముంచు నీదేభారమని మఱిమఱి దండంబులువెట్టి నిజపరివారంబులతో భోవనుర్యుక్తుఁ డగునంతకు నందఱుసూచుచుండ గనే బ్రాహ్మయ్య తనసామర్థ్యంబును నాభోపుని మఱలబ్రతికించి బుద్ధులుసెప్పి విశ్రుతీఁగక భక్తులను భయపడుచు వారలసేవచేయుచు నీవు ను భక్తుఁడవై మనియుంతంబున నాయంతకాంతకు నుపాంతంబునకు విమానంబున నఖండతేజో విరాజమానుండవై యేఁగి ప్రమథగణంబుల తోఁటివాఁడవు గానందయుండుమని చెప్పి వెంటనె వానిదేహంబు లింగ సంగతంబు గావించి పంపెను రాజును బ్రాహ్మయ్యా ననేకవిధంబుల గారవించి తనపురంబున దిరంబుగనుండుమని కోరి సెలవుగైకొని చనియె. బసవేశ్వరులును గొంతవడి నాతనితో నిష్టాలాపంబులఁ గాలక్షేపము సేసి యాయనందనగృహంబునకు గొంపోయి యిద్దఱును సుఖగోష్ఠినుండిరి. ఈ కిన్నర బ్రాహ్మయకథ వినువారును వ్రాయువారు నొరులకుఁ గథ రూపంబున నుడువువారునుఁ జిరంజీవులై యీభూలోకంబున స్వేచ్ఛ మనుగానుండి తమయిచ్చవచ్చినప్పుడు కైలాసంబున కేఁగుదురు

కలకేతబ్రాహ్మయ్యకథ

మఱియు శివపూజాపరుండును భక్తనిత్యసంతర్పకుండును లింగ సంగతానుభవార్భుతప్రతుండును గతకలుషుండును కనికలోష్టసమబుద్ధియు నగు కలకేతబ్రాహ్మభ్యయను మహానుభావుఁడొకఁడుగలడు ఆ తండు జీవన్ముక్తుండై నిరాశుండును, నిర్మోహుండును నిరహంకృతుడై యొకచేతఁ దగఁబూఁగొమ్మును వేఱొకచేతనొకకుడియాము ధరించిశివుడే యీవేషంబున దినదినమునకు గుదెంచుచున్నవాడని భక్తులనుకొన నిత్యం బును భక్తులయిండ్లకేఁగి "అమ్మలారా! యక్కలారా, పరమతపతి

తులఁ దాకిపొడిసేయఁగల రుద్రునినిటలాగ్నివచ్చెఁజూడుమా. మ తేతర
జనకమలంబులనాళంబులతోఁగూడ నూడుబెఱుకు వీరభద్రభద్రగజం
వచ్చెఁదిలకింపుఁడు భూతలంబునఁగల భక్తులయిండ్ల విందుగొనుపాపపు
భక్తాధముఁడు వచ్చెఁగనుఁడు ప్రమథులముందునను సోదరుఁడను
దుగ్గళవ్వకు ముద్దుకొనుకును సంగళవ్వకు ననుజుండు నగువాఁడు నను
డెంచె'నని వారలతోఁ బలుకుచునవ్వించుచు నిత్యమును వారలొసం
గెడి తెంమలాదిపదార్థంబులు దెచ్చి వారితో జంగమార్చనాసంతర్పణం
బుల భక్తతృప్తిగావించుచుండును. ఇట్లుండ నొక్కనాఁడొక శివభక్తు
డలసిసొలి యతనికడకేఁగి యేమియుమాటాడలేక యాయాసంబునఁ
గొంతవడి యూరకుండుట బ్రహ్మయ్యగని యేలయిఁతయలసినాఁడవు.
ఇంతప్రయాసపడి యిటురాఁగారణంబు సెప్పవచ్చునేనిం జెప్పుమనవుడు
నాభక్తుఁడు పెదవులార్చుకొని చేతులుపిసికొనుచు నిట్లనియె ‘‘శంకరు
డు భక్తవశంకరుఁడును పరమేశ్వరుఁడుగనుక దనభక్తులకే కొఱఁతయు
లేక వారికివలయుధనంబొసంగుచుండు తొల్లినంబికి నిత్యమునుం బది
వేయి రూప్యంబుల నిచ్చినటుల నేడు కిన్నెరబ్రహ్మయ్యకు నిత్యమును
గొంత సొమ్ము నిచ్చుచుండునని విని యాతనిదర్శనంబుసేసి యేమైన
నొకతృణముఁబట్టుకొనిపోయి కుటుంబపోషణము సేసికొండమని పోవుచు
న్నాను. వారిమరమిక్కడికింకయు నెంతదవ్వున్నదో'' యనెను అదివిని
బ్రహ్మయ్య కోరికగలిఁగి శివునిఁదలచుటతప్ప నిష్కామసేవయొనర్చు
చుచుండ వలెను నిష్కాములకువలయు భోజనపదార్థంబులు శంభుండె
యొవరో యొకగృహస్థుమూలమున నిప్పించుచుండును ఈతృణప్రాయ
మగుధనంబునకు నీవంత దవ్వరుఁగ నేల? వలసినధనము నేనిత్తును గొని
పొమ్మని చెప్పి తనయొద్దనున్న గుదియను గంటతోఁదాటించిన గని
గళుమని బంగారుచినచిన్నవి పెదపెద్దవి కణికెలు జల్లున నేలమీఁద
నొకరాశిగఁబడెను. అదిగని బ్రహ్మయ్య జంగమదేవరనుబిల్చి నీకువల

యు నన్ని కణికెల నేటికొమ్మని చెప్పినపై నా భక్తుఁడు, పడిసకుండదపు
బంగారుకణికెలు దనకుమోయుటకు భారంబుతలఁకఁ దగినమూటఁగట్టి
నాఁటికచట శివపూజఁగావించుకొని మఱునాఁ డుదయమున మూట
నెత్తిఁబెట్టుకొని తిన్నగామోయలేక పడుచులేచుచు నక్కడక్కడదిం
చుకొనుచు నెట్లకో యొకతీరున బసవన్నయున్న కల్యాణపురంబునకేఁగి
మోతదించి లోనికింజని బసవనమంత్రింగని యాతనికిఁ దాఁ దెచ్చిన
ధనంబువిధ బతము నెఱింగించి యాధనంబు దనయింటికి మోసికొని
పోవుటకు నొకరిద్దఱుపరిచారకులం బంపుమని ప్రార్థించిన విన్నబసవేశ్వ
రులా బ్రహ్మయ్య యీవికి నచ్చెరువంది యాభక్తునకు ధనముమో
యుటకు నిద్దఱునొకర్ల నిచ్చిపంచి తనమనంబుననిట్లు వితర్కించె—
కలకేతబ్రహ్మయ్య యెంత భక్తుఁడోగదా ఎంత మేటిభక్తుఁడుగాకున్న
మాకిన్నెరబ్రహ్మయ్య బత్తినీసడించునా? అట్టిమహానీయుని దర్శనము
నర్చి యాతనియనుగులంబడని జన్మమొందు"కని కిన్నెరబ్రహ్మయ్యను
గూడఁదోడ్కొని యిద్దఱునవి కలకేత బ్రహ్మయ్య సదనంబునకరిఁగి
యాతనియనుఁగుఁదమ్ములకుఁ దమశిరంబులసోఁక సాష్టాంగనమస్కా-
రంబుగావించిన వారలనిద్దఱ సగౌరవంబుగా నాదరించి యాసనంబుల
నాసీనులంగావించి కిన్నెరబ్రహ్మయ్యంజూచి బసవేశ్వరులుకోఁ గొం
తప్రసంగబు సేయఁదలంచి యిట్లనిరి, 'బసవన్నా! మన కిన్నెరబ్రహ్మ
య్యనుఁ బోలినభక్తులు లోకంబున నెవ్వరేనింగలరె? తొల్లి న చిశివు
నివలన దినదినంబును నిత్తెబత్తెంబునకు గాను వేయిమాడలు గైకొని
నట్టులఁ గిన్నెరబ్రహ్మయ్యయు మిసుపికయ్యవలన నిత్యమునుకూడ
యుం జిన్నంబునుం బాతికయు ధనముఁగొనుచున్నాఁడు. శివునిఁబలికించి
నవాఁడు. మఱియుఁగైలాసంబున కేబొంకితో నేఁగి మఱల నేతెంచిన
వాఁడు శంభునివలనఁబడిగొనుటయు నాతనిసాక్షిగాఁగొని గంభీరధ్వని
తో నాతనిచేసాక్ష్యమిప్పించుటయు, యథేచ్ఛగాఁ గైలాసంబునకేఁగి

మజలిసచ్చుటయు సామాన్యభక్తులు సేయఁగల కృత్యములుగావు. మఱియుబ్రాహ్మయ్య శివభక్తులనేకమంది నెందఱువచ్చినను దృప్తిగా విందొనర్చుచుండును. బహుదినృత్తులచేఁ దానార్జించినధనమును శివుఁడిచ్చు ధనంబును నొకప్పుడుచాలక పోవునేమో. ఆధనంబునకుఁదోడు మావద్దఁగూడఁగొంత ధనమున్నగాని పొమ్మను. వేనవేలుబండ్లకొలఁది ధనమూతనికిచ్చినను మాకేమియుఁగొఱతలేదు మీరిప్పటికేగి కిన్నెర బ్రాహ్మయ్యను బంక్లిచ్చిపంపుము తాఁజేయుధర్మకార్యములలో మా ధనమున్న సైతము గొంతకలియనిమ్ము ఎవియో కొన్ని యల్పులవృత్తులవలన మేమార్జించి పాతిపెట్టిదాచుకొన్న ధనంబేగాన మాకుశివుఁడు ధనమివ్వలేడు. ఇంతకాలముకుగాను భక్తులమైయుండి మేము తన్నెంతఁబూజించినను మాపై నాయుమాపతి చిఱికన్నువైచెను గాని తన యీశ్వరత్వము స్థిరపఱచుకొనుటకు మాకెంతయైశ్వర్యమివ్వలేదు. మేమడుగలేదనిచూ నెను అడుగకపోయిన నివ్వవలెనని యాతండెఱుంగఁడా? కాయున్న శివుఁడు పేదవాడె పేదవాఁడుకానిచో భిక్షాటనమేల సేయును? అతనిభక్తులము మేమును బేదవారమె పేదలమనిమమ్ము ననాదరభావమునంజూడకుఁడు మాకు నెన్నివేలబండ్లపై బంగారుగావలెనో యన్నివేలుశకటంబులు నికటంబుగాఁ బంపుఁడు శంకరదాసయ్యకు ననుంగువెంకలమగు మాకుధనంబులేదని మీరుమనంబున శంకింపవలదు నమ్మరేని జూడుఁడు. చిల్లరవృత్తులచే మేముసంపాదించి పూడ్చిపెట్టిన బంగారుధనమ్మని కలకేతబ్రాహ్మయ్యయటఁ బడియున్న యొక మట్టిబెడ్డను జేతఁబట్టిచూపెను అంతలోనదిబంగారు దిమ్మయైకనుబడెను అదిచూచి బసవేశ్వరులును గిన్నెరబ్రాహ్మయ్యయు కలకేత బ్రహ్మయ్యకుఁబునస్సాష్టాంగంబొనరించి పాదములపైఁ బడిలేవకున్న జిఱునవ్వునవ్వుచు వారలనిద్దఱ లేవనెత్తి యాలింగనంబు సేసి మంచిమాటలనాఁటివినము వారల శివపూజలందన యుంటఁజేయించి బహూకరించి

పంపెను. కలకేతబ్రహ్మయ్యయుఁ దనయథాస్థితినుండెను. అట్టిమహా నుభావుఁడగు కలకేతబ్రహ్మయ్యచరిత్రము జదువువారును విన్నవారును వ్రాసినవారును నిష్కాములై యీలోకంబున నెల్లసుఖంబులనుభవించి యంతంబునఁ గైలాసంబుఁ జొఱఁగాంచి మోక్షపదవి నొందెదరు.

## మోళిగమారయ్య కథ

సర్వదా శివభక్తుల నర్చించెడు పరిపూర్ణచిత్తంబు గలవాఁడును శుద్ధసత్త్వగుణోపేతుఁడుఁ దత్త్వజ్ఞానియు జీవన్ముక్తుఁడును, కామక్రోధలోభమోహమదమాత్సర్యంబులనెడు పశ్యతోహరులగు నిపుణతస్కరులు జ్ఞానిరత్నము నపహరింప గాఁచియున్నను దానిని వారిబారిఁబడనీక నిశ్చలమనంబను దృఢపేటికయందు దాచి కాపాడుకొను వాఁడును కాష్ఠకేతృవృత్తిని జీవించుచున్న మోళిగమారయ్య యనునొక శివభక్తతల్లజుండు గలఁడు. అతండు నిత్యంబు నడవికేగి యొండుకట్టియల మోపొకటి మోపికొనివచ్చి యంగడినమ్మి తనమ్మాలంబున జంగమారాధనంబు సల్పుచు భక్తసంతర్పణబు సేయుచునుండును ఇట్లాతం డొనర్చుచుండ దన్మందిరమున నొకనాఁడు కొందఱు జంగమభక్తులారగించి బసవేశ్వరు గృహంబునకు మఱునాఁడుసని యక్కడ షడ్రసోపేతభోజనంబుఁగావించి భుజించుతఱి "ఓసవన్నా! నీయింటఁగుడిచిన నానావిధరుచ్యంబులగు భక్ష్యభోజ్యలేహ్యపానీయాది చతుర్విధాహారభోజనంబును మోళిగ మారయ్య యింటఁదిన్న యంబలికి సరిరా” దని యాతనితోననిరి. అదివిని బసవేశ్వరులవారు మారయ్యయింటికిఁజని భుజించి చూడవలెనని మనను వ్రేకమిని నపుడయొక నిరుపేద జంగమవేషంబున మారయ్య యింటికేగి యాతండరణ్యమునకు బోయియున్నను తద్ధర్మపత్ని యర్ఘ్యపాద్యాంబులొసంగాని యెదురుగాఁజని పూజింపసమకట్టుట యు నవిసేకొనక కొంతదడవుట మసలి మఱికొంత సేపున్న యెడల నెత్తిఁగి

యున్నవా రెవ్వ రేని విచ్చేసిన మొసలఁ దినగుట్టు బయలువడునను భయం
బునఁ దటాలున లేచి గుబుక్కున నొక్కదాటున శివపూజాస్థలంబున కే
గి యటఁగూర్చుండి ''అమ్మా! మా లింగమూర్తి యాఁకొనియున్నవాఁ
డు మా శివపూజయైనది. మహానైవేద్యము తరువాయిగన్న వేగముగ
నీయింటఁగల పదార్థ మెవిదియేని దడవుగొనక నానిమిత్తము మఱల పీడ
కసిద్ధముగానున్నది. యింతయుం బలియైనను సరే శీఘ్రముగ వడ్డింపుమా,
తెమ్మా, రమ్మా'' యని మారయ్య భార్యనడుగ నామెయు మిక్కిలి
భక్తితో నంబలియె తెచ్చి యొడ్డించిన మిగుల నాప్యాయముతో దానిం
దిని కడుపునిండినదనుటకు సూచకంబుగా త్రేనిచి కడుపుఁ దడవుకొనుచు
నాయమ్మకు మ్రొక్కి శివపూజాస్థలంబున లింగమూర్తి నలంకరించి నా
గాభరణము పడగ వెనుక రెండు బంగరు మాడలుంచి లేఁచిపోయెను పో
వుచు. బోవుచు మారయ్యమహిమ కలరి ''నేఁడుగదా జన్మంబు సార్థ
కమ యనది. ఈతనియీవికి కల్పవృక్ష కామధేను చింతామణి మేరున
గంబుల త్యాగంబుగ్రిందను మన్నది ఈతనియింటి చూరునుండి రాలు
ధూళి యెవనిశిరంబునఁబడునో వానిశిరంబు శిరంబు ఈతనియింట గుడి
చిన యంబలియె యమృతము దాని నారగించినవారికి మఱిక్షుత్తృష్ణ
లుండవు ఈతండు రెండవ విశ్వనాథుండు ఈతనిధర్మపత్ని యన్నపూ
ర్ణమ్మ ఇట్టి భక్తుఁడింక నీభూలోకమున మఱియొకఁడుండఁడు. పేదవా
నివలె దానున్నను భక్తసమారాధనము దనయింట నలువదిగడియలు
నిరాఘాటముగా జర్గుచున్నది'' అని యనేకవిధంబుల నాతనిం గొనియా
డుచుం బోయెను అంత మధ్యాహ్నముగాఁగా మారయ్య మోపు నెత్తి
నిఁ బెట్టుకొని యింటికివచ్చి భుజించుచున్న మరికొందరు భక్తులంగని మ
హాసంతోషంబునొంది ''నాయింట నెల్లవేళల నిట్లు భక్తులాసక్తితో విం
దారగించుచుండవలె'' నని మనంబునం గోరుచు లోనికి నరుదేర నాయమ
యెదురుగా నేఁగి మోపుదింపి గోడకుఁ జేరవైచి యుష్ణోదకంబుల నాతని

పాదంబులు జానువులవఱకుఁ బిసికి కడిగి పథశ్రమంబు గొంత వాయఁజే
సిన నొక్కింతతడవు కూర్చుండి లేచి స్నానమాచరించి శివపూజకుం
గూర్చుండి లింగమూర్తి నాగాభరణంబెఱింగించి యభిషేకంబు సేయఁ
బోవుచు దాని చాటునునుంచిబడిన మాడలుగని యివి యెవ్వరుంచిరని
భార్యనడుగ నామెయు నదరిపడి చూచి యిందాక నొక భక్తుఁడు శివపూ
జఁజేసె నతండుంచియుండవచ్చు" ననెను ఆతని బసవేశ్వరులుగా నెఱిం
గి మారయ్య మిక్కిలి సంతోషించి "ఏమి బసవనియౌదార్యము! తా
నుధనవంతుండు. మేము పేదలము మాడలమొగమె మేమెఱుఁగము.
గాన మాకు రెండుమాడలిచ్చి పోయెను ధనవంతులకు ధనహీనులయం
దిట్టి దయయుండుటె వలంచి నెగదా" యని తానుశివపూజ దీర్చుకొనిభు
జించి యభిషేకంబొనర్చిన యాలింగోదకంబు దానప్పుడె తెచ్చి గోడకుఁ
జేరఁబెట్టిన నెమ్ముకట్టియలమోపు పైఁజిలుకఁ నాకట్టెలన్నియు బంగా
రుకణికలయ్యె వానివన్నింటిని జిన్నతుకలుగాఁ గొట్టించి వెయ్యేసి
మాడలమెత్తున కొక్కొక్కతునకగాఁ జేసి బసవన్నయిచ్చిన రెండుమా
డలు నిద్దఱు భక్తులకిచ్చి కొందఱుభక్తులకుఁ దాఁదెచ్చిన బంగారుమోపు
వెయ్యేసిమాడల తునుకలు నొక్కొక్కరికి నొక్కొక్క వేయిమాడల
మెత్తుతునుకలనిచ్చి యంపెను వారందఱు బసవేశ్వరుల పాలికింబోయి
మారయ్య యిచ్చినట్టి మాడలమెత్తుగల తునుకలంజూప బసవేశ్వరులు
సిగ్గుపడి తానిచ్చినరెండుమాడలు నిద్దరుభక్తులయొద్దఁ దీసికొని వారికిబ
దులు వేమేసిమాడలిచ్చి తక్కినవారితో సమానధనవంతులుగాఁ జేసి
వారలనంపి దాను చిన్నమొగంబుతో మారయ్యయొద్దకరిగి యడుగుల
కెఱఁగినంజూచి "బసవన్నా! యేలచిన్నబోయెదవు? నేనన్నతప్పు లేదా.
భాగ్యవంతుఁడవీవు నిర్భాగ్యులముమేము మమ్మరసి మాకుధనంబిచ్చితివి
మేలయ్యె దీనికోపంబేల? నీవంటి భక్తుఁడెందుఁగలఁడు? నేఁడుమాకిచ్చి
నటుల దినదినము నీకడకువచ్చు భక్తులకందఱికట్లిచ్చుచుండుము. అప్పు

డుగదా నీభాగ్యము బయలుపడను నిన్ను మెత్తురు మడివాలయ్య
మును కులము మేము మమ్ము నీలోఁగలుపుకొనుము. నీయౌదార్యమునీ
కుంకు మెచ్చుకోఁగలడు" అని యనుచున్న మారయ్య చరణంబుల
నియచేతులంబట్టి శిరంబునఁ దాల్చి లేవనున్న బసవన్నను మారయ్య లేవ
నెత్తి శిరంబుమూర్కొని యాలింగనము సేసి "భక్తవరా! నీవుకలహం
సవు, నేఁగాకంబను నీవు పరిసువేదివి నేనయఃఖండంబను నీవుహస్తిని
నేనుమశకంబను నీవురత్నంబవు, నేంశర్కరంబను నీవుజ్ఞానివి, నేనజ్ఞానిని
నీవువిరాగివి, నేనురాగిని. నీవుగుణివి, నేనిగుణహీనుండను. నన్నుఁగటా
క్షించి తత్త్వోపదేశంబు సేసి భక్తిమార్గంబునం బురికొల్పుమా" యని
యనేకవిధంబుల నుపచారంబులు సెప్పుకొని యాతనివలన ననుజ్ఞాతుఁ
డై నిజపురంబునకరిఁగె. మారయ్య యుదినయథాస్థానంబున యథాస్థి
తితో సుఖంబుండె ఈమారయ్యచరిత్ర వినువారును జదువువారును
మోక్షంబున నపేక్షితంబుగాఁ జూఱఁగొనుట కేమియాశ్చర్యము

## కన్నడ బ్రహ్మయ్య కథ

మఱియు శివభక్తులలో నగ్రగణ్యుండును జంగమోపాసకుల
లో మొదటివాఁడును వీరశైవవ్రత ప్రధాన నియముండును బహిరా
గంత ర్యాగ క్రమారాధితార్యాపతియు లింగార్పిత నిజధన శరీరుండు
ను, జంగమ లింగార్చనా పరాయణుండును, భక్త సంతర్పనార్పిత
మానసుండును, శివార్పిత సకలపదార్థ పరిత్యాగుండును, రెండవ శం
భుండని లోకవిఖ్యాతినొందిన కన్నడ బ్రహ్మయ్య యనునొక భక్తుఁడు
గలఁడు. ఆతండు చౌర్యవృత్తియె తనకు సుఖవృత్తిగా నవలంబించి తదా
ర్జిత ద్రవ్యంబుల జంగమార్చనలు నియమంబుతో నెఱవేర్చు చుండును.
దొంగతనంబునకు వలయు పరికరంబులు, కన్నముత్రవ్వ సాధనములు,
చిన్నగునపము, కత్తెర, కత్తి, త్రాఁడు, తోరపడము, పలుక, నారస
ము, కాటుకదోకి, కాటుక, యీటె, మంత్రాక్షతలు, యెఱ్ఱకాలినోఁచి,

నల్లపాత తలచుట్టు, కుక్కల నోరుకట్టు, ఒకటియట్టె చెప్పులు, పోడి, నంచి యీ మొదలగు దొంగతనపుఁ బనిముట్లుగొని ప్రతిదినము గృహస్థుల యిండ్లకరిఁగి ధనంబులు దొంగిలించి తెచ్చి శివభక్తుల కిడుచుండును. ఆ దొంగతనంబునకుఁ జొఱఁబడిన యిండ్లు కాలవశంబున భక్తలయిండ్లయ్యేనేని దీపంబులు వెలిఁగించి వారలలేపి మీయింటి దాసుఁడను. కాపురాయు కుక్కను మీ భక్తుండను. కన్నడ బ్రహ్మయ్యను నన్నెఱుఁగుఁడు. మీ ధనధాన్యంబులు భద్రబఱచుకొనుఁడు నేనున్నంత కాలము మీయిండ్లకు వచ్చిన భయంబులేదు నేఁ గాచుచుండెద" నని తొలఁగి పోవును. భక్తులుగానివారల యిండ్లలో ధనకనక వస్తువాహనంబులంగొంపోయి శివార్పితంబుగా శివభక్త సమారాధనం బొనర్చుచుండు నిట్లుండ నొకనాఁడాతని యింటికి నసంఖ్యాకతంబగు భక్తసంఘాతంబు సనుదేర వారలకు విందొనర్ప ధనంబు కేమి, నన్యుల యిండ్లకుఁబోవ నింతవేగముగా సిద్ధముగానున్న బిజ్జలుని భాండాగారము దప్ప మఱియెక్కడను దొఱకదని పట్టపగలు రెండుజాములవేళ పరికరములం దాఁపెగి రాజగృహంబునకు దొంగతనంబున కరిఁగి తొల్లిబసవేశ్వరుల యింటికిఁజని దొంగతనపు బనిముట్లు నాతనికిం గూడ నొసంగి రాజధనముకొల్లకు కన్నము వేతమురమ్మని పిల్చి యాతఁడుతోడరాఁ గన్నము ద్రవ్వి లోని కరిఁగెను అచటఁ గన్నము త్రవ్విన మన్నంతయు నాతఁడడుగిడినచోట్లనున్న మన్నంతయు బదియాఱువన్నె బంగారయ్యెను. లోనఁగలపెట్టియలం దెఱచి వలయు ధనంబుగొని మఱలి చనియె నెచ్చటనాతఁడు దొంగతనము సేసినను నిండుసంచులువిప్పి కొంతధనంబుఁగొనిన నాసంచులు మఱలభర్తియగుచుండును. కాననీతని దొంగతనమువలనఁ బిజ్జలకు నష్టము లేదు. మన్ను బంగారగుట వలన మఱింతలాభమె అట్లుబ్రహ్మయ్య సనిన నాతనిఁబట్టఁబోయిన భటులు పట్టలేక మగుడినరు దెంచి "స్వామీ! మన భాండాగారమునఁబట్ట

పగలు చిన్నదబ్బ్రహ్మయ్య దోచుకొనిపోయెను వానికిసహాయంబు మన
బసవనమంత్రియు దొంగవేషమునవచ్చి యచటమీరాకకెదురు
సూచుచున్నవాఁ''డని విన్నవింపరాజును మిగులసంతసంబున విచారం
బును బాఱఁగొనుచు మనంబున ,,నేఁడుబసవన్ననాకు దొరికెను. పట్టపగ
లు నాధనముకొల్లను గొల్లవెట్టఁదలంచినవాఁడు మఱిదేనికిసహసింపఁడు
నన్నడిగినఁదనకువలసినంత ధనంబీయకపోదునా? ఏలయిట్టియప్రశస్తపుఁ
బని సేసెనో'' యనితక్షణము వచ్చి కన్నముఁజూచి మన్నుబంగారుకావి
డలుచూచి మార్గమున నాలిని యడుగులుబడ్డచోటను గన్నపుమన్నంత
యు బంగారపుమన్నుఁదిలకించి యాశ్చర్యపడి కోపంబుమాని ,,బసవన
మంత్రీ! యేమి యీచిత్రము! ఈబంగారమేమి?'' యనియాడుగ ,,దేవ
రా! మీరెఱుంగరా ఈశ్వరునిరెండవరూపమటుల నుండెడువాఁడు
దొంగతనమెతనకు వృత్తిగాఁగల మోళిగమారయ్యయను భక్తుఁడొ
కఁడు తనయింటికి నసంఖ్యాతమహాభక్తులను దేర వారలఁదృప్తి సే
య భోజనపదార్థములకు ధనములేమిఁబట్టపగలు దొంగతనమునకుఁ
దగినపరికరములఁగొని బయలుదేఱి మనధనముకొట్టు దోచుకొనఁదలచిఁ
నన్నుఁబిలిచిన నేను మఱుమాటాడలేక యాతనివెంటనంటివచ్చితిని.
వచ్చుత్రోవలో నాతనిశ్రీపాదముద్రలచిహ్నంబులందలి యిసుకయుఁ
గన్నముత్రవ్వినమన్నును బంగారమై యిట్లు మెఱయుచున్నవి ఇఁక మన
పెట్టెయలలోని ధనంబుగణించిచూతము అన్నియునిండుసంచులేగాని
వెల్తిసంచియొకటియు లేదుగదా. వానింగలిపి యీవెలితిసంచిలోని
నాణెములు జమాఖర్చు చిఠాప్రకారము లెక్కపెట్టిచూచిన సరియుసరి
గానున్నది. దొంగయనుపేరెగాని యతనిదొంగతనమున మనకుఁగలిగిన
నష్టమేది? పైపెచ్చుమనకు మిఱింత విలువలేనిబంగారము దొరికినది వింటి
వా రాజా! భక్తులచరిత్రము వారునడచినదే త్రోవ పట్టినదే బంగారము.
వారొకప్పుడధర్మంబునఁ బ్రవర్తించిన నదియొపరమధర్మంబగును దాన

నెగడా «అధర్మో ధర్మతాంవ్రజేత్" అను నానుడిపుట్టినది. ఒకరికిఁ గష్ట
ము నిచ్చిన పనియే మఱియొకనికి సుఖముఁ గలుగఁ జేయును. ధర్మరాజు జూ
దమాడి తమ్ములతోఁడను, ధర్మపత్నితోఁడను వనవాసాజ్ఞాతవాసంబుల
నిడుమలంబడెను ఆజూదమున నెగడా దమునినారపు మహాదేవు సాక్షా
త్కారంబుగనెను రాముఁడు వేఁటాడి యాలింగోలిపోయెను కన్నప్పవేఁ
టాడి శివునిఁగలిసె హింసవలన మాండవ్యమహాముని కొఱతవడియె.
ఆహింసవలననె చండేశ్వరుఁడు శివప్రసాదంబు వడసెను ఎరసతులంగూ
డిన వారందరు నరకమున యమభటుల పట్టుఁ గోలలపాలైరి. పరసతిని
సర్వదా యుండుకొన్ననంబి యీశ్వరసాయుజ్యంబు నొందెను బ్రము
చ్చులు శిక్షాపాత్రులై యుండ గొఱియ మ్రుచ్చగుసూద కుంతు నఱుకున
బడి వధ్యశిలకెదురేఁగుచు మహేశుభక్తుండై విడువంబడియె మఱియు
«రాజ్యాంతే నరకం ధ్రువమ్" నుటకు బ్రతికూలంబుగా నోడఁకును
బేంమరాయుడును రాజ్యాంతమున మోక్షంబు నొందిరి వారిలచర్య
లటు డనిమ్ము కన్నడ బ్రహ్మయ్య మాహాత్మ్యం బెఱిఁగించెద నాక
ర్ణింపుము - భక్తులాఁగొని యన్నంబునకై తనయింటి కేవేళవత్తు రావేళ
నేయలెండు రాత్రియనక పగలక సాధనస పత్నితోఁ దొంగతనమునకు
బయలువెడలును కన్నముద్రవ్వి లోనికిఁ రిఁగి యాయింటిలోని వారలు
ధరించిన శివచిహ్నంబులంబట్టి యవి భక్తులయిండ్లని తోఁచినఁ దొలఁగిపో
వును ఇతరులగృహంబులైన నంచలిధనంబులు గొల్లఁగొని జంగమార్చ
నకు వినియోగించును. పట్టపగలరెండు కన్నము త్రవ్వునపుడుగాని, లోని
కేఁగి ధనసంచయంబుల గొనునపుడుగాని యితరుల కదృశ్యుండుగానుం
డును. ఇంటికాపులు భక్తులైనవారికి గనఁబడి చెప్పిపోవును ఇతరులైన
వారలధనముఁగొని రాఁబోయినను వారిధనమెప్పటి యట్టులనుండును
గాని తఱుఁగదు. అదియేమిచిత్రమో నరనాథులుగాని, భాగ్యవంతులు
గాని, తన్నుఁబిలిచి లక్షలొసంగినను దొంగతనపుసొమ్మగాని యాలక్షు

లు గికులు లక్ష్యము సేయువాఁడుగాఁడు. ఇట్లు కన్నడబ్రహ్మయ్య ప్ర భావంబును చెప్పిన బసవేశ్వరుల బిజ్జలుండును సంభావించి తనధనంబిను మడి యకుటఁగాంచి సంతసించి వీడ్కొని నిజనివాసంబునకుం జనియె. కన్నడబ్రహ్మయ్యయుఁ దాఁగొన్నధనం బిలు సేర్పుటయు, నాతనిభార్య మొకురుపని యూటలంకుకొని భద్రపఱుచును ఇట్లు సంతతజంగమా ర్చనా పరతంత్రుఁడై కన్నడబ్రహ్మయ్య జీవవృత్తి నడుపుచుండెను అట్టి బ్రహ్మయ్యచరిత్రంబు వినువారును జదువువారును కొదువలేనిసుఖంబు లనుభవించి యంత్యంబున ననుపమమోక్ష సామ్రాజ్యంబునకుం బట్టాభి షిక్తులగుదురు

## ముసిడిచౌడయ్యకథ

ముసిడియనునొకపురవరంబున చౌడయ్యయనునొకభక్తుఁడు క లఁడు. అతఁడువీరశైవుఁడు రెండవవీరభద్రుఁడు ఆచరితసకలపుణ్యాకర్మ ఫలత్యాగి అమోఘపరాక్రమశాలి శాంభవానుగ్రహదక్షుఁడు విఖ్యాతఘ నుఁడు. విద్యాప్రసాదైకసం. అవధుఁడు. జంగమలింగాభ్యర్చనావినోది శ్రౌత క్రియాపరతంత్రుడు సాంఖ్యాధికవాసనారహితుఁడు ప్రాజాపత్య బ్రహ్మచారి. ఖడ్గపాణియునగు నసిముసిముసిడి యతఁడొకానొక దినంబున వీరువారనక సకలజనంబులును బసవేశ్వరులభక్తిసామర్థ్యం బులు పొగడుచుండుట విని యతివిరగన నతికుతూహలంబు గలవాఁడై భక్తగణంబులతోఁగలిసి యుసురుచు ముంగనొక యరణ్యంబు గని యందు వికసెను. ఆయడవినిముసిడిచెట్లు ఫలభరితంబులై బలిసివెలిఁగి యొక్కొక మేరునగంబుభాతిఁ గన్పట్టుచుండె. తోడనున్న భక్తగణం బులు చౌడయ్యపాలికిం జని "దేవా! యీముసిడిపండ్లను శివార్పితం బులుగానించి కడుపార మెసవవలెను నానమాసుఁబోడమినది నీయా నతికై నెదురుచూచుచున్నవార"మనిన ముసిడిచముఁడయ్య ముసిముసినగ వు మొగంబునలంకరింపఁ దనచేతికరవాలంబా చెట్లమూలంబులకుఁ

దగులనిచ్చి యొకరాపురాచి యథేచ్ఛఁగా భుజింపుఁ"డని సెలవొసంగ భక్తులందఱా పంక్తులమెండుగఁగొని లింగసంగతంబులుగావించి కడు పులనింక భుజించి "నేఁడుగదా ముసిఁడిచౌడయ్య నామము సార్థకమయ్యె"నని యాతనింబొగడిరి అంతమఱునాఁడచటఁగదలి చౌడయ్యయు భక్తులును కళ్యాణపురంబునకుంజనిరి. తొలినాఁటి తనశివపూజాసమయమున బసవేశ్వరులు తనయిష్టదైవమగు సంగమేశలింగమూర్తి యందు చౌడయ్య స్వరూపమును జూడఁగని యాతండరుదెంచుచున్నవాఁడని యెఱింగినవాఁడు గావునఁ గొన్నియడుగులెదుర్కేఁగి పాదంబులకుఁ బాద్యంబును హస్తంబులకు నర్ఘ్యంబునొసఁగి యింటికిఁగొంపోయి శివపూజచేయించి విందొనరించి కళ్యాణపురంబునఁ గొన్నాళ్లుండుమని ప్రార్థించి యీశ్వరభావంబున నాతనినారాధించుచుండెను ఇట్లుండఁగొండొకదినంబున వీరశైవమురాచాకులెల్లరు నాతనికింగళ్యాణంబు గావింపనూహించి యనేకసేవనలిచ్చి పెండ్లికింబొమ్మని బహుమానంబుగావించి తామునుకోడసఁ జనుమ వివాహంబునకాని గొనిపోవుచున్న సమయంబున మధ్యనొక చతుష్పథమార్గంబున నొకతపస్వి మృతకళేబరమును వాహకులుపరేతభూమికిఁగొనిపోవుట చౌడయ్యగనిపెట్టి "ఔరా! యీమహాతపసిచే దీవనలనొందమి నీతఁడుఁగూడ రామి నాకీపెండిలి యేలయని యావాహనంబునాపి దింపించి ఖడ్గంబునూడఁబెఱికి యాతపసితనువునంటఁజేసి "మునివరా! గ్రుస్కు ననిక్క లేచిర"మ్మనవుడుఁ గట్టిన త్రాళ్లుదెగి యంతనాతపసిలేఁచి నిద్రమేల్కనినవానివలెఁ గండ్లునలుపుకొనుచు వచ్చి చౌడయ్యకునమస్కరించి నిలుచున్నవానింగని చౌడయ్య "రోయయ్యా! నీవుసాతూత్తు మినుసికయ్యావు ఏలయీనరవాహనంబున బయలువెడలితివి నీసంగడీఁడకు గుబేరుఁడునరవాహనుఁడని నీకు నట్టికోరిక వృషమెనా? ఇఁకఁజాలు నావాహకులంబొమ్మనని నాకొఁడన పెండ్లికరుదెమ్ము నీయాశీర్వచనరహితంబగు పెండ్లినాకక్కఱలేదను

టయు నాతపస్వియు ముందఱ నడువఁజొచ్చెను అంతమఱికొంత దవ్వు లరుగుచో నచ్చటఁ బసులకాపరిపిల్లకాయ లాడుకొనుచుండెను. యా పులమేయవిడచి యవిచెవరితోఁగవదప్పి వెడలునపుడు వానిమళ్ళించుచు పాటలుపాడుకొనుచు గెంతుచు చెట్టెక్కుచు విహరించుచు నొకవిష యంబునఁ దమకువివాదంబు గలిఁగిన నాతిగవ్వుఁ దీర్చ నందలియొక పెద్ద పెయ్యలవాఁ డందఱఁ బిలిచి యాతగవునకు సాక్షి యీబసవ వటవిటపియె యనుట చౌడయ్యవిని వారలం జేరఁ జీరి "యోరీ! పాపలారా, బసవమ ఱ్ఱియేమిరా?" యనియడిగెను అయ్యా! దీనికొక గాథగలదు తమతా తచే వింటినని మాతాతమాకుఁ జెప్పెడివాఁడు. వినవలదేని దద్వృ త్తాంతంబంతయు నెఱిగించెదనని యిట్లు చెప్పందొడఁగె

"పూర్వకాలమునందు రెండువద్యాహంబులు బరదర్పితములై యొండొంటితోఁ బోరాడి యహోరాత్రములు మల్లయుద్ధముసేసి తుద కొకదానిచే తెరువడి యొకటిమడిసె నంతనిచట శివభక్తులాచచ్చినదాని నిట సమాధియొనర్చి దానిపై నిమఱ్ఱిమొలిపించిరి నాటంగోలె నీమఱ్ఱి చెట్టునకు బసవమఱ్ఱియనిపేరు, దీనిఫలంబులు మాంసఖండంబులం బోలి యుండి మాంసపురుచి గలవియైయున్నవి [illegible] రసంబును (అనఁగా చెట్టునతెకిన వచ్చెడిపాలు) రక్తప్రాయంబు కడునెఱ్ఱగానుండు" నని చె ప్పెను. అదివిని చౌడయ్య నేను బసవనిచావువింటిమి బసవనం జెయం డుబుగా ముందుండునని వివాహంబునాకేల యని నొంటనున్నకత్తి దానిమొదలనత్తి "మఱ్ఱిమూలంబుననున్న యోబసవనందీ! లేచిరా"మ్మ నెను అప్పుడు నాఁడు పూడ్చఁబడిన యావృషభంబు వంబుదూరి తొం టీరూపంబున గుబాలున లేచి యొకగంతువైచి చౌడయ్యను మూచూ చి చెట్టుమొదల వాసనఁజూచి మూత్రవిసర్జనంబుఁ గావించి కాలుద్రు వ్వి తోఁక యాడించి గింగిరఁ దిరిగి మఱ్ఱిప్రదక్షిణించి ఘణిల్లుమని ఱంకె వైచి ముందున్న తపస్వితోఁ దానును బుర్రగమనంబున వివాహంబు

నకరుఁగుచుండె ఇట్లు దపసియు నాఁబోతును గొలిచి రా వివాహంబు కే
గుచు మార్గమధ్యమున నొకయతి దీర్ఘ ప్రసారితంబగు మహాసరిత్తుంగని
యాకసంబున కంటుచుండిన నందలియలల కల్లోలంబుగాంచి తొలఁ
గిపొమ్మని చౌడయ్య తననిస్త్రింశం బానదికీళులం ఝళిపించి గంభీర
ధ్వానంబునఁ బలుక నాకాశగంగ చే శివభక్తులప్రభావంబు విననేఁగనో
యన్నటుల మిగులెగయునలలతో నొకపాయయయి [illegible] జెలిమి
సేయఁబోయెనో యన్నటుల, [illegible] నూర్మికార
హితంబగు నల్పప్రవాహంబుగల పాయయొకటియు గా త్రొడువాయలై
నడుమ నెడల్పుత్రోవయొసంగిన చౌడయ్య ముందునడుచుచు గత్తినెత్తి
చూపుచు రండని పిలువ నందఱునాయేటిదాటి యవ్వలఁ జనినిలుచున్న
చౌడయ్య తిరిగిచూచి మోహంబుజెట్టె త్రుళ్లులేక మెల్లనఁ బొమ్మనియా
నతిచ్చి మునివృషభునకును వృషభంబును మంగళనడువఁ గళ్యాణంబున
కుంబోయి క్రియాలోపంబుగాక వేదమంత్రప్రూరితంబుగా వివాహ
క్రియా నివర్తియొనరించి కల్యాణపుర పునరాగమనంబున ముందున్న
ఋషివృషభములఁ చరితంబుఁ బరిజనులువిని యానందానందంబున
బొరలఁ బురప్రవేశంబు గావించి భోగజుపప్రయోగ మాంత్రఘోషంబగు
వైదికవీథి నరుఁగుదఱ నొకబాలశశిమణి యాంతనికినెదురై నమస్కరించి
శతాయుఃపరిమాణపుగమ్మని దీవనఁబొంది నాఁటితేయి సుఖంబుండె ను
ఱునాఁడరుణోదయంబున నరుణకిరణ తనయునాయంబునకుం బయనంబై
పోవుదాని నావాహనంబుతోఁగూడ మోపికొనివచ్చి దానితలిదండ్రులు
చౌడయ్యముందఱఁబెట్టి నిన్నఁగడా యీబాలనీచే శతాయుఃపరిపూ
ర్తిగా వరంబునడసి నేఁడు మిడిసినది. నీయాశీర్వచనమె గుఱిదప్పనయె
డల నిఁక నెవ్వరి యాశీర్వచనము నిలుచును" అని యేడ్చువారలం గనిక
రించి తానాశవంబునొద్దకుఁబోయి మండలాగ్రంబున దాని తన్వగ్రంబు
నంటి, బాలేందుముఖి! ఏల యీలీలనిద్రించెదు పగటినిద్దుర పద్మముఖు

లకుఁదగునా? కమలనయనలన యనకమలంబులు పగటిపూట వికసించి
యుండఁ జెలఁగాని ముకుళింపవచ్చునా?" యనుఁడు నిద్రమేల్కాంచి సభా
తినానాతి లేచి కూర్చుండెను అంతకుమున్న దానితలిదండ్రులు చేతులు
జోడించి నిలుచున్న వారలతోఁ దామును కరకమలంబులు ముకుళించి వి
నలువురకు నప్పటికిగతించిన వయఃపరిమాణంబుగాక ప్రత్యేకశతాయః
పరిమాణాయువు నొసఁగి నమ్మువ్వురను లింగసంగత దేహులఁగావిం
చె అంత నాపుర జనులు వీరువారనక యెల్లవారును వచ్చినవారిప్రాణం
బులు మరలనొసఁగి వారలరక్షించిన నాదయ్యొక్కరక్షింప డోపుఁగాని
యన్యులోపుదురే యని తన్నుఁగాని పొగడుచుండఁ జేడయ్యయెప్పటి
యట్లఁ దనయథోచిత వర్తనంబుననుండె నట్టియెడఁ గొందఱు పరమతా
వలంబకులు తనులోఁ దాము చేడయ్య ప్రభావమునుగూర్చి ప్రసంగిం
చుకొనుచు" సీతంతా దాసనాడుకొని పోయినదినంబు నొందినవారి
ప్రాణంబులు వారికిమరల ఒయసేయసమర్థుండుగాని, యెన్నఁడో సచ్చి
కుళ్ళి కంపుగొట్టుచున్న మృతకళేబరమును పునర్జీవితుఁనుగఁ జేయఁజా
లునే? చూతము" అని వారందఱుఁ గలసి యొకగోనెసంచి దెచ్చి దాని
లోని కాళ్లుచేతులు గన్నులు ముక్కు చెవులు,తల కడుపు, వీపు, వేళ్ళు,
గోళ్ళు, మొదలగు నవయవంబులు గలయుఁగట్టి లోనగడ్డికూరి యక్క
డక్కడఁ దారాళ్ళతోఁ గట్టులుగట్టి యూరివెలుపల నొకపాడుగుడివెనుక
బడవైచి వేర్వేఱ నొకరితోనొకరు చేడయ్యకు వినఁబడునట్లుగ
"నూరికడనున్న పాడుగుడివెనుక నొకజంగమతపసి కళేబరమున్నది.
ఏనాడుసచ్చి యటఁబడినదో తెలియదు కుళ్ళి కంపుగొట్టుచున్నది ఎవ్వ
రునట సనవెఱతురు పాపమా గతజీవునికిఁ బ్రాణదానంబుసేసి చేడ
య్య బ్రతికింపనోపునేమో?" యని సంభాషించుకొనుచుండ నందుఁ
గొందఱు "మనమితరులవలె భయపడినలాభమేమి? మనము మతేతరు
లమైనను శవము జంగమమతశవము అదిగో శివచిహ్నంబు లగువిభూ

తిరుదాత్రాదులు గనఁబడుచున్నవి. దానిని చౌడయ్యతప్పఁ బ్రతికింపఁ
గలఁడుగాని వానినొక విమానమున నెక్కించి మనమందఱము మోసి
కొనివచ్చి యాయనయెదుటఁ బెట్టుదమని యనుకొనుచుండఁగ నొకఁడు
తనచేతికఱ్ఱతో దానింబొడిచి "యౌరా! కుళ్ళుగుమ్మడికాయవలె లో
లోనఁ గుళ్ళినది రా. కఱ్ఱగుచ్చినంతగా బడినది ఎంతనీరు పైకిబుస్సునఁ
గారుచున్నదో. కంపు కంపు బాయఁజాల" మనుచు నొకవాహనముఁ
గల్పించి దానిపై నాశవమునుబెట్టి నలువురుమోసి చౌడయ్యకట్టెదుర
బెట్టిరి దానినామహాత్ముఁడుగని యిద్దిభక్తులుచేసిన మాయగాని మఱి
యొకటిగాదు కానీ, దీనినిఁజూచి జనులాడెడు నెఱుఁగంద నొకజంగమ
మునిఁగాఁ బొందుపఱచెదనని డాయంబోయి తనకరవాలంబు చేలనాని
దాని నాశవంబు శిరంబునమోపి "యోరీ బుడుత నెలదాల్పా! యల్పంబగు
నీరూపంబున నేలయడంగితివి? నిన్నుంగనఁ నిచట భక్తులెందఱు వేచియు
న్నారో చూడుము. ఈక్షణము వేగము లేచిరమ్మా" యనుఁడు నామా
యాశవంబె యొకయమానుష రూపంబున లేచివచ్చి చౌడయ్యపాదము
లపైఁబడి "భక్తపోషకా! నేనొకజంగమభక్తుఁడను తొల్లియేజన్మంబు
నలేక యిదియేనా తొలిజన్మంబుగా నీచేతన సృష్టింపఁబడిన వాఁడను
సామరులందు భక్తులునన్ను గోనెసంచుతో నిర్మించి నీమూలమునఁ
బ్రాణములు గలవానిఁగాఁ జేయించిన ఘన నేఁటినుండి నేను గోనెదా
సుఁడను నామంబుతో నీకడ నీయనుగుబంటనై పరిచర్యలుసేయుచుం
డెద. నన్నుఁగాపాడి రక్షింపుమా" యని సాష్టాంగదండంబిడి లేవకున్న
నాతనిలేపి పరిచారకగణములో గలుపుకొని యామాయఁ గావించినపా
పమతులగు పరమతాచారులను హతులఁగావింప దలఁకొన నాతనికిన
ద్యులై వారెల్లఅతిలజ్జావనతశిరస్కులై వేడుకొన్న వారలనుగటాక్షిం
చి యితరమత చిహ్నంబులందీయించి లింగసంగత దేహులంగావించి
బుద్ధిగలిగి మసలుకొం" డని బుద్ధిసెప్పిన వారలు "అసమానధైర్యవీర్య

ప్రతాపధాముండవగు నోచౌడయ్యభక్తవరా! శరణాగతత్రాణకృపాణ
ధురీణా! పాపచిత్తులము దుష్కర్ములము జ్ఞానవిహీనులము శివభక్తి
విరహితులము నీయెడల నపరాధంబొనర్చినవారము "అన్యథాశరణం
నాస్తి త్వమేవ శరణమస్మాక" మ్మని నీయడుగులఁ బడ్డవారము. మ
మ్మురక్షింపుము నీవేమావాలింటి ఫాలాక్షుండవు మాయనేకజన్మసు
కృతపరిపాకంబున నీపరిచర్యసేసి నీదాసానుదాసులమై యిలఁగలకాలము
మనఁగోరుచున్నార" మని యనేకప్రకారంబులఁ గైవారములు సేయుచు
చౌడయ్యకునమ్రులై యుండిరి. ఈముసిఁడిచౌడయ్య చరితము జదివిన
వారును విన్నవారును వ్రాసినవారును వాసిలేని యీశభక్తులై సకలసు
ఖంబుల ననుభవించి నిటలాక్షుని లోకంబునఁ దుదిని శాశ్వతపదవినుం
దురు.

## సురియచౌడయ్యకథ

మఱియు సురియచౌడయ్య యనునొక భక్తుఁడు జితేంద్రియుం
డును భూతదయాసాగరుండును విగళితసంసారబంధుండును శ్రద్ధానుష్ఠి
తకర్ముండును సజ్ఞానసిద్ధాంతుండును నసంగవిహారదూరుండును నవవిధవార
నశ్యంబును కామనాశనుండును మాయాప్రపంచనిర్వంచితుండు నగుటం
రసాన్ భక్తాజిహ్వాగ్రయను లోకోక్తి ననుసరించి గురులింగభావంబులఁ
జరలింగంబులనారాధించుచుండును అతఁడుకళ్యాణపురంబుననున్న భ
క్తులనాశక్తితోఁ బ్రార్థించి గృహంబునకుం గొంపోయి పాలును నేయి
యు పప్పుఁగూరలుఁ జారుఁబులుసుఁ బెజుగు గారెలు బూరెలు నపూ
పంబులు నరిసెలుఁ బంచభక్ష్యాన్నంబులు షడ్రసోపేతంబులగు నాహార
పదార్థలం బొతిలలో నొడ్డనసేయించి వారలశివపూజలుసేయించి చేతు
లుజోడించి శిరంబునఁదాల్చి "మహానుభావులారా! భుజింపుఁ"డని
ప్రార్థింప హరభక్తులకు జంగమలింగమూర్తులు కడుపులకింపార భోజ
నంబులు సేయుచుందురు ఇట్టుభక్తులకు శివపూజలుగావించి తానును

గూర్చుండి నిజలింగమూర్తినిఁ బూజించునపుడు దానభిషేకమొనర్పక
పూర్వమె యీశుని నేత్రములనుండి హర్షాశ్రులు జారుచు దేహమంత
యుఁ దడుపుచుండును. సజ్జయుంకలి పువ్వులఁ గొని పూజ చుటకు ముం
దె నిజమనస్సరసిజము హరునిశిరంబునఁ దనరుచుండును. వ్రకధూపం
ఒగ్నియందు వైవకమున్నె యీశ్వరునందలి వాసనలు పైవెడలును దీప
ము వెలిగించుటకు మునుపె యాత్మజ్యోతి భూతేశుముందఱ వెలుగుఁ
చుండును. పక్వపదార్థంబు లర్పింపకమున్నఁ దన ప్రాణముపహారమై
యమరుచుండును ఇట్లాశర్వబహిర్నిష్టల లింగము మనోభావంబున ని
త్యంశివపూజసలుపుచు నైవేద్యం బొసంగు తఱుణమునకుఁ దనయొద్ద
నున్న సురియయొరఁ బాసి పత్రమునకడ్డము నిల్చిన దానినందుకొని
పూజావేదికకొక్కమూలఁ బెట్టి "స్వామీ! నీవు నా చేతియన్నంబుఁ బ్రత్య
క్షంబుగా స్వీకరింపలేనిచో నీ సూరకత్తిచే గొంతుఁ గోసుకొనియెదఁ దలచి
యొకబంగరుపళ్లెరంబున సకలపదార్థంబులుం బెట్టి చి వానిఁ గలయఁ
గలపి కబళ్లుకబళ్లుగాఁ జేసి యొక్కొక్కటి నెక్కువమనంబున మిక్కిలికఁటి
దేవరు నాహ్వానంబు సేయుచు నందియ్య నయ్యిందుశేఖరుఁడును జన
చేయుసాఁచి యా ళ్లందుకొని యత్యాపత్యయముతో నారగించెను.
ఇట్లు ప్రతిదినమునఁ ద్రిసంధ్యలయందు సురియచౌడయ్యతోఁ జంగముం
డుడు ప్రత్యక్షముగా నాతని చేతిప్రసాదం బారగించుచుండె. సంసారసం
క్లేశపారావారంగతుండై యాతండునిండుమనంబున మెండగుభక్తిస
లుపుచుండును. ఇట్టుపూర్వకాలమందు సైతము భక్తవంతుండగు వేదండ
చర్మాంబరుండు భక్తవాత్సల్యంబున వారలయిండ్ల నారగించుచుండెడి
వాఁడనివిందుము. కరికాలచోడుఁడను కాలకంఠునిభక్తుఁడొకఁడు దొల్లి
మెత్తగాఁ గాఁగిన మీఁగడపాలు మున్నూటయిరువదిపుట్లు నూతనతు
లుం బులవించి యందుకుందగిన శాకంబులను ముప్పందుముమిరియాల
తోఁ బాకంబు సేయించి పళ్లెరంబులలో భక్తినునిచి యాయుధహస్తు

డై యీశేషముం దఱఁబెట్టించి యారగించు చప్పుడు వినవలయునట్లు వినఁ
వినఁబడనివో మెడఁగోసుకొని యెద ననియు వినయముతో నిలుచున్న
యాతనికి శ్రుతిగోచరంబగునటులు బుడబుడఁ బీల్చి జుఱ్ఱిన చప్పుడును
మీఁగడయుఁ గాయగూరలును నమిలినధ్వనియుఁ బిప్పినుమిసి వైచిన
స్వనంబునుఁ గలుగ॥ జేసి యారగించెనట మాదరచెన్నయ్య తొలిది
నమున ఘనమగు భక్తితో సీతున కంబలివెట్టి మఱునాఁడు నట్లే యొన
ర్చి యామెంగిలిపాత్ర నిత్యము నంటగిలి ద్రాగుపాత్రగా నుంచుకొమ్మ
న నది యాతనియందలి యనాదరంబుఁ సంబాధవుండంగీకరించె ననివిం
దుము. మఱియు ద్రాక్షారామమున వీరకోడన్న తా భుజించుచుఁ దన
కుమిఁగల జలినైన కడి నగమునిచి మఱియొన మనసొప్పక దానినొకచి
న్న పళ్లెరంబున నుంచి తనదాసిచేత నీశ్వరాలయంబున కనుప నదిసని
యిషది మాయక్క నిన్నఁ దినుమని యపీరన్నగారు మ్మని యుంచి
య్య ! మహేశ్వరుండా కొప్పరసంచుకొని యా యెంగిలిముద్దఁ దిని యా
పాత్ర నాలోవెలి చిలుపల బసనైచునని పెద్దలుసెప్పఁగ విందుము ఇ
ప్పటియుం డెఱుఁ గనుఁగొనుచుండె సురియ చౌడయ్య చేతి కల్లందుకొని
భుజింపలేదా? అట్టి యీసురియ చౌడయ్య కథ వినువారును, జదువు
వారును వ్రాయువారును, నొరులకు వినుపించువారును, వ్రాసినపొత్త
ములను భక్తితోఁ బూజించువారును సద్యోముక్తిం గందురు.

## తెలుఁగుజొమ్మయ్యకథ

శివభక్తియుక్తుండును బాపరహితుండును చిదగ్నినిర్దళితశుభా
శుభకర్ముండును కారణజన్ముఁడును నిస్తులయశుఁడు వీరశైవుఁడు సంగరహి
తుండును సతతలింగము లింగార్చనాసక్తుఁడును కిరాతపురారి యేరూపం
బున నవతరించెనో యనునటుల శివసారూప్యశరీరచిహ్నుఁడునగు తెలుఁ
గుజొమ్మయ్య యనుభక్తుఁడు గలఁడు. తండసమానదానవిద్యాపరా
క్రమధురీణుండై శివభక్తిపరతంత్రుండునై లోకహితార్థంబు జన్మించి

నవాఁడుగావున నిత్యజంగమలింగపూజావిధానుండై కళ్యాణపురంబు ననుండును

ఆతెండటులనుండఁగా శ్రీశైలంబున శివానందుఁడను నొకముని పుంగవుండు తపశ్చరణైకవృత్తి నొకయాశ్రమంబు కల్పించుకొని తపో నిష్ఠనుండ నాతనియొద్ద తెల్లఁబుట్టబలిసి నీలాద్రివలె నగుపడుచుండెను. అచటికొకనాఁడు గంధర్వులుతమ భార్యతోఁగూడి స్వేచ్ఛావిహారంబు లుసలుపుచు నాతోవనాకాశగమనంబున నేఁగుచుఁ గొండవలెనున్న తంబుగాఁగన్పట్టు నాతపసిపుట్టంగని యిదియేమొచిత్రము. ఇచ్చట నున్నది కొండగాదు కేవలము డుత్పయనుంగాదు లోనబురబురగ నుకు వినబడుచున్నది ఇదియొక కదలమెదలలేని యొక యెలుగుగొడ్డయియుం డునని తమలోఁదామనుకొనసమయంబున నచటనున్న యాముని శిష్యుండు తనగురువును భల్లూకమని వారన్నఁదున కలుషించి «ఓయి గంధర్వులారా! మీ దైవకగమనంబునకు గర్వించి క్రిందుమీఁదు గానక మహానుభావుండగు మాగురు నిమ్మృగప్రాయునిఁగా మాటాడు చున్నవారు. మీగర్వమె మిమ్ములఁబడనున్నది నేటిమొదలు మీరం డఱు నాలుబిడ్డలుసహా మృగంబులై యారణ్యములఁ దిరుగుచుండుఁడు” అనికఠినంబుగాఁ బలుక నాతనికి గంధర్వులునమ్రులై «మేము తృణీకా రభావంబున ననలేదు అమాయకంబుగా కట్టుగనఁబడినది కనుక మమ్ముఁ క్షమింపు” మనవుడు «వాఁడు నావాక్యం బమోఘంబు బ్రహ్మ లిఖితమైన నొకప్పుడు తప్పునదప్పును గాని నాశాపంబు దప్ప”దనెను వారుమోక్షణంబుఁ బ్రసాదింపుమన నాతండు మీరెల్లరు గళ్యాణ పురపరిసరారణ్యంబున మృగంబులరై తెలుగు బొమ్మయ్యచే వేటా డంబడి మీరుమీగంధర్వరూపులంబడసెదరు. పొండ”నవారు తక్షణము మృగజన్మంబులనొంది పూర్వజ్ఞానసంపన్నులై యెప్పుడు బొమ్మయ్య వచ్చి నెప్పుడు మనకీశాపవిమోక్షణం బగునని యెదురుసూచుచుండ

టు రెండు చెక్కలగునటులగా ఖండించిపాఱవైచెదను. నీవంటిమూర్ఖులిం
దుకుఁ బ్రయోజనము లే"దని వానితోఁ గఠినముగాఁ జెప్పెను. అంతనా
జైనుఁడు చిఱునవ్వు నవ్వి "యోమూఢుఁడా! నీమూఢభక్తి విడువుము,
జ్ఞానమార్గము నవలంబింపుము. 'నిస్త్రైగుణ్యేపథివిచరతాం కోవిధిః కోని
షేధః' అనెడు శంకరసూక్తివినలేదా? మేము గుణరహితులము. గుణా
వలంబకులము గాము. గుణాతీతులము. మాగురుబోధ నీవువినలేదు
కాఁబోలు! మేము విగ్రహారాధన సేయము. మాది కేవలము సమాధ్య
వస్థనుండు ధ్యానమతము. మనోనైర్మల్యము ప్రధానముగాని, బాహ్య
నిర్మలత్వమేల? పాముపట్టినపాత్రను. బైనితోమి శుభ్రపఱచినటుల నీ
నీబాహ్యపవిత్రప్రవర్తనంబును. నీవంటిమూఢభక్తుఁడొకఁడు చెప్పుకాలి
తో నీశ్వరునిపైనున్న నిర్మాల్యముఁ దీసెనని వింటిని. నీ వెఱుఁగవా?
భ్రాంతిలేక నిశ్చలమయిన మనసుతో నేమిచేసిన నదియెల్ల జనసహ్యమ
ముగును. ఇంతకు శివాయుధంబునకు నీయధికారమేమి? ఇదె సర్వజనగ
మ్యంబు. ఎవరిభక్తిమార్గమున వారు పోదురు. మా భక్తిమార్గమిదియ.
ఇఁక నీ చెడుగును మఱుగుఁడుగుము కాదేని నీతల నీశ్వరార్పణముసేసి
మఱలఁబడయుము. అట్లైన నీసాహసము నీశివనిష్ఠనతెఱయు లోకంబు
నకు వెల్లడికాఁగలదు" ఇట్లని జైనుఁడనునంతలో నేకాంతరామయ్య
"ఛీ! పిచ్చిజాపుట మొంతపని కానీ, నీకు తల శివునికిచ్చి మఱలఁ బడ
యుమనెను. అరిమొంత! ఒక్కసారి నాశిరంబు ఖండించి హరాయని
సమర్పించి మఱల మొలిచిన శిరంబు గలవాఁడనై పిదపనప్పుడు నిర్లక్ష్యం
బన్నారును నన్నాటంకపెట్టలే"రని మనంబుననుకొని వానిం జేరియిట్ల
నెను "ఓరీ! జైనాధమా, నీవు కోరినదియొక దుర్ఘటకార్యము కాదు
శివభక్తులకసాధ్యములు లేవు శిరమిచ్చి తెచ్చుకొనుట యొకగొప్ప కాదు
తొల్లి జంబూనునూర నొకభక్తుఁడు, మహాకాలుండను పేరుగలవాఁడు
మహాకాలుండగు శివునికి శిరము సమర్పించి తిరిగిపొందలేదా? అవ్యాత్ర

గోవిందభట్టునాఁబడు నొకభక్తుఁడు విని తలదేవునికిసమర్పించి మూఁకు
న్నాళ్లకు వేఱొకతలను బడయు లేదా? అదివిని మొదట దనంకయ్యాయను
నొకభక్తుఁడు నవ్వి ॥ఆ॥ యిది యేమివింత నఱుకఁబడిన తలమూఁన్నాళ్ల

<<కిఁ మొదట దవంకయ్య తనతలనఱికి శివునికిచ్చుటకథ>>

కాతిరిగి మొలచుట! ఈమూఁడుదినములు శివుఁడచట లేకుండెనా? నఱుకఁ
బడిన తలగల మొండెము నచ్చికుళ్లలేదా? వెంటనే మొలువవద్దా? అయి
నను భగవత్సమర్పితము సేసినతలను మఱలఁగొనుటగూఁడునా? నేనట్లు
గ్రహింపను. మూఁడు ముచ్చితలలు భగవంతుఁడు మొలిపింపనో” అని
యెల్లఱుఁజూచుచుండఁ దనతలఁగండ్రకత్తిచేఁ జక్కనఁగత్తిరించి
శివునిపాదంబులపైఁ బడవైచినఁ దక్షణమునఁతియొక తల మొలిచెను.
దానిందిరిగి ఖండించెను తక్షణమునఁతియొకటి మొలిచెను. దానినిసైత
ముఖండించెను వేఱొకటియుప్పుడె మొలిచెను ఇట్లుమొలిచినకొలఁదిఁ
దలలనఱుకుచుండెను నఱికినకొలఁదిఁ దిగఁబలు మొలచుచుండెను ఇట్లునఱు
కుటకు భక్తుఁడువిసువలేదు. నఱుకఁబడినతలలుభూమిపైన కుప్పకుప్ప
లుగాఁ బడియుండెను. ఎప్పటికప్పుడు మొలిచినతలయొక్కట యట్టపై
ట్టిచూపులఁ జూచుచుండెను భక్తునిచేఁ నఱుకఁబడిన లెనతలలు నజీ
వంబులై యీశ్వరసన్నిధిని నిలువంబడి సన్నుతులయు, వెక్కిరించుతల
యు కలవఁబోవుతలయు పాదములపైఁబడుతలయు శిరంబునవిలుచుతల
యు ప్రదక్షిణమాచరించుతలయు దండములిడుచుల నేలకొఱఁగుతలయు
స్తోత్రము సేయుతలయు పరిహాసోక్తులువలుకుతలయు నై యనేకవిధం
బులనుండఁ దుదకునొకతల పార్వతిపాదంబులకు మ్రొక్కి ॥అమ్మా!
చూచితివా, మాయమ్మ సామర్థ్యము. నఱికినకొలఁదిఁదలలు మొలిపిం
చుచున్నవాఁడు నిర్లక్ష్యముగా వాఁడు నఱుకుచునెయున్నవాఁడు తుద
కు మేమీఘోరకృత్యముఁజూఁడలేక విసువుకొనుచున్నాము గాని యాభ
క్తునికి నీభగవంతునికి విసువుదలలేకయున్నది. నీవైన పేరలపంతంబులు

మాన్పింపవేతల్లి'' యని మొఱవెట్టును. అప్పుడులోకమాతయు భూతే
శునితో "మనభక్తునితో మనకింతపంత మేల. భక్తుఁడునుతపాత్రుయుఁడు.
నిజముగఁగన్నతనయుఁడె. పుత్రాదిచ్ఛ ల్విరాజయ'మ్మని తమకెఱుం
గకేని ఇఁక నీతలకాయలన్నియు నంతర్ధానంబుసేసి భక్తునితోనీకు నేతోఁ
డిటనని చెప్పిమందలించి వానిశిరఃబుతో వానినుంచుకుని నియోగిం
పు''డని మనవిసేసెను. మనోనాయువివాక్యను గారవించి యుక్కాల
కంఠుఁడు వసకటుచేయువట్టి మఱికుంఠింపనీక నీకునేనోడితినని యుత్తని
తలలన్నియుఁ దనశరీరమున నంతర్ధానంబును సేసి నీభక్తినిదలుచిచూడ
నాకలవిగాదని నిజపరాజయంబు నంగీకరించి భక్తుని సమాధానపఱచె.
చూచితివా, జైనా! భక్తులసామర్థ్యము ఇదియునుంగాక భయంకరా
కారులగు ననేకుల మీజైనులను మాభక్తులు పడఁదోలిన చరిత్రలు
గలవు చెప్పెదవినుము

## తిరునావుక్కరసి కథ

తిరునావుక్కరసియను నొకజైనమునియుండెను అతని కాకస్మి
కముగా నొకశూల (కడుపునొప్పి) పుట్టెను. అదియెన్నిమందులు తినిన
ను కుదురలేదు లోకమునఁగల మందులు మాకులు మంత్రములు తం
త్రములు కడుపునొప్పిని మాన్పలేదు ఓర్వలేని యాబాధపడుచుండు
నాతనిసోదరి వచ్చిచూచి శివమంత్రప్రభావంబున శివభక్తులాదరమున
నిచ్చు తీర్థప్రసాదముల నీశూలకుదురునుగాని, యన్యథా దీనికి నివార
ణోపాయంబు లేదని యన్నకుబోధించి యతనిని శివభక్తిపరాయణునిఁ
జేసెను. అతండును చెలియలిమాటలు గైకొని శివభక్తులశరణుసొచ్చి
వారిపదరజంబు శిరంబునఁదాల్చి వారిచ్చిన తీర్థప్రసాదంబులుగైకొని
నంతటఁ దనబాధిమాని యనాయాసంబున నిరామయదేహుండై చె
ల్లెలింబిలిచి "నీకతంబున నాసూల నివారణమైనది. నేను బ్రతికితిని.
ఇఁక నేసర్వదా శివభక్తుఁడనై దాసానత్వంబుదానున భక్తులసేవయొ

నొకనాఁడు శివపూజార్థంబు బిలపత్త్రికొఱకు నరణ్యంబునకేఁగి నా
తని గని మృగంబులు "ఈతఁడె బొమ్మయ్యగా నోపుఁ గాదేని వీనింగని
న మనకు నానందము వొడముచున్నది" యని యనుకొనునవసరమున
నందొకవృద్ధమృగంబు బొమ్మయ్యపాలికిం జని దండము వెట్టి "అయ్యా
మేము గంధర్వులము ఒకమునికుమారుని శాపవశంబున నిప్పాట హ
రిణజన్మలమై మృగరూపంబుఁ బడియుంటిమి మాఖేచరగమనంబును
గంటి. నీచేవారితులమై మాకుణాంబునొందెదము ఇదియమాకుపర
మావధిగా నాతండు నియమించెఁ గావున మమ్మిఁ బరిమార్పుము
నా మాటనిజముసుమ కొకని ర్వ్యంబు గినవలెను పెఱవేటకాండ్రకు
మేము దొఱకక పిచేతియాయుష్పాతంబునను యీ దేహంబులం విడిచి
దివ్యదేహులమై ఖేచరగమనంబునఁ గైలాసమార్గంబున నరిగెదము.
కని పెట్టు" మనవుడు బొమ్మయ్యయు నిజయోగదృష్టిచే సర్వంబును
సత్యంబుగా నెఱింగి నల్లెయని పురంబునకుం జని మఱునాఁడు వేఁట
కాండ్రంబిలిచి "తేపు మనము వేఁటకుం బోవలెను మనపురంబునఁ గల
వేఁటకాండ్రసంకట బిలువుఁడు రాని వారల దండింతునని డప్పువేసి
చాటింపించి తానును చిత్రసాయుధములఁ ధరియించి పచ్చంట్టుపంచగట్టి
ఖండువా మీఁద వైచి తమతమ సన్నాహంబులతో వేఁటకాండ్రు
తోడరా నడవిఁ జనిచని ముందుఱ సాలరసాలతమాల హింతాలాది వృక్ష
జాతంబులతోడను హంసకారండవాది జలవిహంగమములతోడను విల
సిల్లు సరస్సులతోఁ దుఱుఁగొను నయ్యరణ్యంబుఁ గని మృగయావినోదం
బునకుం దవిలి వేఁట కుత్తరువీయ వారలు కుక్కలగొలుసులువిప్పి వదలి
యాయుధంబుల నేయ సమకట్టిరి ఒక్క మృగమైనను దొఱకక బొమ్మ
య్యకెదుటికేఁ బోవుచుండెను అతండు గురిపెట్టి వాండ్రఁ గూల్చుచుం
డెను. ఇట్లు తమచేత నొకజంతువైనను దొఱకకపోవుటయు నవియెల్ల
బొమ్మయ్య చేతఁజచ్చుచు వెంటనే దివ్యరూపంబులు దాల్చుచు ఖేచర

గమనంబులఁ గైలాసంబున కేఁగుట వారుచూచి యవికారణజన్మమృగ
ములని యోచించిరి బొమ్మయ్య దినమున కేఁడేసిమృగంబులఁ జంపి శివ
పురంబున కనుపుచుండె. బొమ్మయ్య వేఁటాడురీతిఁ జారులవలనవిని రా
జును బసవేశ్వరులును గలిసి యరణ్యంబున నాతనివేఁటసూచి యరుదం
దుచుండిరి అప్పుడు బసవేశ్వరులు రాజుతోడను పురజనులతోడను
"గురుధ్యానమను బిండివాలమున సంసారసింహంబును బరిమార్చి భక్తి
సమాధానమను ముద్గరము పూర్వజన్మ దుష్కృతములను భల్లూకముల
నడంచి గుర్వాజ్ఞయనుఖడ్గంబున శ్రీమత్పుండరీకింబు నాళంబుతో ని
ర్మూలంబు సేసి సుజ్ఞానమను దీర్ఘాపిచే నజ్ఞానమను వరాహంబుగ్రుచ్చి
మొత్తి భక్తియనుతోమరమునఁ బ్రపంచమాయ యను మనుఁబోతు
గ్రుళ్లడంచి నిత్యప్రసాదంబను వింటి నింద్రియంబులను వేళ్లను పాఱఁ
ద్రోలి నిర్మలశివనామస్మరణమను కిరాపిచే లోకజాలంబను మిండకాని
గండడఁగించి భావ్రాక్తియను నీపణత్రయమును హరమహిమయను
పట్టణంబున, పరమతవాసులను మృగంబులంజంపి యిట్లుబహిరంతర్మృ
గయావిహారుండగు బొమ్మయ్య కాటవి మృగంబుల నరనిమిషంబులో
డినుముట యొకయాశ్చర్యమా? వెనను బ్రకృతిననుసరించి దినమునకే
డేసి చంపెను" అని బొమ్మయ్య మహాత్మ్యంబుఁ గొనియాడుచుండ
బొమ్మయ్యయును యథాస్థితింకనరె. ఈబొమ్మయ్య చరితంబుఁ జదువు
వారు విన్నవారు వ్రాసినవారు శాశ్వతసుఖసంపదల ననుభవింతురు.





# బసవపురాణము.

## షష్ఠాశ్వాసము

---

### ఏకాంతరామయ్యకథ

మఱియు మహాశీలాక్రమశాలియు యథావిధి సదా సమర్చిత శూలియు, జైనమత మేఘపటల ఝంఝామారుతుండును, జితేంద్రియుండును, భవిసంస్పర్శసమాలాపాది వ్యాపారదూరుండును నిర్భీతుండును, పరమపాతకప్రహాణగుణోదారుండును రౌద్రరసవీరభద్రుండును వీరశైవమార్గప్రచారుండును శంభుపదసేవావధానుండును రహస్యభక్తి సంయుక్తమానసుండును ధైర్యశౌర్యౌదార్యగాంభీర్యాది సమస్తగుణోపేతుండును స్వచ్ఛందయోగమార్గగమనప్రవీణుండును నగు నేకాంత రామయ్య యనుభక్తుం డొకండు గలండు అతండు ప్రతిదినము శివపూజానంతరము ప్రమథగణలోకంబున కరిగి వారలతో నిష్టాగోష్ఠినుండి మఱిల పూజాసమయంబునకు భూలోకంబునకేతెంచి, పూజానంతరమున దిరిగి యచ్చోటికి నేగి యీప్రకారంబున నిత్యత్రికాలశివపూజాసమయములందు భూలోకమున శంభుపూజాసముగుండై, తదితరకాలముల నుగ్రప్రమథగణలోకంబున తద్గోష్ఠినుండుచు నుభయలోకంబులకు గమనాగమనంబులు యథేచ్ఛగా సలుపుచుండును ఇట్లుండ నొకనాఁడు చంద్రహాసుఁడు భూలోకమున నడుగంటిన శివభక్తినిమఱల నుద్ధరించి వృద్ధిసేయుమని నందికేశ్వరు నియోగించి యంప నతండు బసవావతారంబున కళ్యాణపురంబున బిజ్జలరాజుమంత్రియై యున్నవాఁడని యాతనికీర్తి ప్రతాపంబులువిని తద్దర్శనార్థము కల్యాణకటకమున కరిగి తనరాక బసవేశ్వరు లెఱుఁగక మునుపె యొక దేవాలయంబున కేగి యందు శివలింగ దర్శనస్పర్శనపూజాధ్యానాది క్రియాలోల

త్వంబునఁ గొంతప్రొద్దుపుచ్చి బయటవచ్చునవసరంబున నొకశైవుఁడు
శివాలయంబులోనికిఁ జెప్పుకాలితోఁ జనుచుండఁ జూచి "యోరీ
మూర్ఖా! పాపాత్ముఁడా! పశువా! యేమిరా నీయాగడము. చెప్పుకాల
తో నాలయములోని కేగుచున్నావు ఛీ! భక్తిహీనుడా! నీముఖముఁ
జూడరాదు తక్షణమీ జోడవతల విడిచివచ్చి స్వామికభిముఖముగా
నేలనొఱఁగి సాష్టాంగదండంబు వెట్టి యోయీశా! యభవా! నేనజ్ఞుం
డను మూర్ఖుఁడను నేనెఱుఁగక సేసినయీపాపమును క్షమించి నన్ను
రక్షింపుము అనివేడుకొనిపొమ్ము అట్లయిన నీయెడల నీప్రాణంబు
లుండును. కానిచో నాచేతియీకఠారంబు. జూచితివా? దీనితో నీశిరం
నఱ్కుదు సద్గురుకటాక్షంబున లింగధారణంబు స్వీకరించి మనియెద"నని
చెప్పి యావెంటనే పగలూరను (దీనికేయిప్పుడు కడపజిల్లాలోనున్న ప్రొ
ద్దుటూరందురు) గ్రామమునకుంబోయి యచ్చటనున్న యొకశైవగు
రుం గాంచి నమస్కరించి "దేవా! నన్ను మీకింకరుగాఁ గైకొని నాకుశి
వజ్ఞానోపదేశంబు సేసి రక్షింపు" డని నిలుచున్న యాశైవగురుంగాం
చి యాశైవగురుం డాతని గుణాంగుళభక్తుని జేయఁ దలపెట్టి తొలు
దొల్తఁ బంచాక్షరీమంత్రోపదేశంబు సేసి దానిని యథావిధానంబున
న్యాసపూర్వకంబుగా ననుష్ఠింపఁ జేసి దీక్షయొసంగి పూర్ణకలశోదకంబు
ల నభిషేకంబొనర్చి లింగప్రాణగావించి యాతని దేహంబు తల్లింగసంగ
తంబు గావించి లింగము ప్రాణముఁగా నెఱుకఁగఁజేసి పాంచభౌతిక దేహా
భిమానంబుం జెడఁగొట్టి లింగదేహాభిమానం బుపదేశించి వాయుమ
యంబులగు ప్రాణంబుల చాంచల్యంబును పృథ్వీమయంబగు దేహంబు
ల యస్థిరతము నగ్న్యాపోమయంబులగు క్షుత్పిపాసల స్వరూపంబును
తన్నివారణోపాయంబులు నాకాశమయంబగు తృష్ణాగరిష్ఠత్వంబును
శమదమాదుల దానినడంచుమార్గంబును జ్యోతిర్మయంబగు జ్ఞానదీప
ప్రభావంబును దానియఖండ తేజోవిరాజత్వంబును కామక్రోధలోభ

మోహ మదమాత్సర్యాంబులను నరిషడ్వర్గనామకాంత స్వత్రుస్థితియు జ్ఞానరత్నంబునపహరింప వారలార్గురు సర్వదా వేచియుండుటయు శత్రువులకుఁ దస్కరులకగమ్యంబగు దుర్గంబున ధనగుప్తి యొనర్చి దానిఁ గాఁపాడుకొనునటుల గృహస్థాశ్రమ దుర్గగుప్తిని జ్ఞానధనసంరక్షణోపాయంబును మఱియు ననేకంబులగు శివరహస్యంబులును దేటతెల్లంబుగాఁ దెలిపి యాత్మలింగార్చనా విధానంబులును వీరశైవులకు సర్వంబును లింగార్చనమె యనియు లింగవీక్షకన్న శైవదీక్ష లేదనియు లింగదేహాలింగప్రాణులే వీరశైవులనియు ననేకంబులగు తత్పూజాద్రవ్యవిశేషంబులును వేళావిశేషంబులును భక్తపరిపాలనలాలనాదికంబులును సవిస్తరముగాఁ దెల్పి యనల్పశివభక్తునిఁగా నొనర్చుటయు నాతిరునావుక్కరసియు వీరశైవుండై విభూతిరుద్రాక్షలు ధరియించి యథాకాలశివపూజలు గావించుచు భక్తులనారాధించుచు శివదీక్షాపరతంత్రుండై యుండఁ దక్కిన జైనులు వీఁడు మనమతమును వీడి శివమతము నవలంబించెను గాన వీని నేనుఁగు కాల ద్రొక్కింత" మని కాలుసేతులు గట్టి యేనుఁగు కట్టెదురఁ బడవైచి మీఁద నేనుఁగును డీకొల్పిన నది తొండమున వానినెత్తి మూఁగగిల నొకవాఁడు మెల్లన దూలగించిచనియె గాని వాని మొదలికిఁ గించిత్తైన ధూళియుఁ బొసంగ నెత్తి మఱల మెల్లగ దిగవిడచెను గజాసురారిభక్తుల నొకసామాన్యగజంబు బాధింపఁగలదే? ఒక్క పర్యాయము చంపుదమని విషభోజనము బెట్టిరి అదియు జీర్ణమై శరీరమునకు మఱింత మెఱుపకాంతిఁ గలిగించె విసపుమేఁతరిబత్తులకు విసమమృతంబు గాకుండునే? వీనిఁ జంపక విడుతుమా యని యనేకకట్టియలం దెచ్చి యగ్ని రగిల్చి మంటగావించి యాపెనుమంటలలో వానిఁ బడవైచిరి ఆమంటయుఁ జప్పనఁ జల్లారి యానిప్పులన్నియు నీరయ్యెను. అగ్నిదేవుని లలాటమున నేత్రముగా ధరించిన యాపావకాక్షుని భక్తుల దహింప కాకి కాగ్ని కెట్లు దీక్షత్వంబు వర్తించు? ఇఁక వీఁడు దెసను జానాడు. "అగా

